# కాల్గేట్‌తో రోజంతా చెడ్డ శ్వాసను నిరోధించండి
# దంతక్షయాన్ని నివారించండి!

ఎందుచేతనంటే కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒక్కసారి తోమినంతనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయ కారకులైన సూక్ష్మ క్రిములు తొలగిపోవును.

కాల్గేట్ 10 మందిలో 7 గురి చెడ్డ శ్వాసను వెంటనే అరికట్టినదని మరియు కాల్గేట్ పద్ధతిలో భోజనానంతరం పళ్లు తోము కొనుట వల్ల దంత శాస్త్ర చరిత్రలో మునుపు ఎప్పుడూ ఎరుగనంత ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని శాస్త్ర పరీక్షలు నిరూపించాయి!
కోల్గేట్‌లో మాత్రమే యీ ఋజువు ఉన్నది.

ఎంతో చక్కని పిప్పరమెంటు రుచికూడా— కాల్గేట్‌తో క్రమంగా పళ్లు తోముకోవటం పిల్లలకు చాలా ఇష్టం.




మీకు పౌడరు కావాలంటే, ఈ ప్రయోజనాలన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడరు వల్ల పొందండి... ఒకడబ్బా నెలల తరబడి వస్తుంది!




ఇప్పుడు! సూపర్ సైజ్ కొని ...డబ్బు పొదుపు చేయండి!

శుభ్రతకు, తాజా శ్వాసకు, ధవళ దంతాల కోసం...
ప్రపంచంలోని ఏ ఒక్క ఇతరటూత్‌పేస్టు కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.

DC.G.38 TEL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫొటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




విడి ప్రతి
**75** పైసలు

సంవత్సర చందా
రూ. **9/-**

మీ పాపని జలుబుతో బాధపడనిస్తారా?

అక్కరలేదు..!

## విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది ముక్కుదిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాప హాయిగా, చక్కగా నిద్రపోతుంది.

విక్స్ వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయచ్చు.

ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది:



1. బయట-చర్మం మీద



2. లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది, హాయినిస్తుంది.

2. లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపొరబ్ మందుఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చిన ప్పుడల్లా ఈ మందుఆవిరి వంట్లో ప్రవేశించి. ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

ప్రత్యేక గమనిక



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి.




516C A

## విక్స్ వేపొరబ్ - జలుబుబాధలకి ఆధునిక ఔషధం

# అంతు లేని ఆనందాన్ని పొందండి
# చూయింగ్ గమ్ చప్పరించి చూడండి!




కమ్మని పెప్పర్‌మింట్ రుచిగల
**చిక్‌లెట్స్ చూయింగ్ గమ్**
మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్,
ఆంధ్ర ప్రదేశ్‌లో
మాత్రమే దొరుకుతాయి

**60 పైసలకు 12**

WH-9200

ఆడమ్స్ వారి శ్రేష్ఠమైన తయారీ

అతని ఆరోగ్యం వెనుకరహస్యం

# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్

మీ పాపసంగతి?



అమృతాంజన్ లిమిటెడ్

FDSAGM1267TE

---

## వాయిదాలపై ట్రాన్సిస్టర్లు




రూ. 320/- ఖరీదుచేసే, లోకప్రసిద్ధి చెందిన ఎస్కార్ట్' 3 బ్యాండ్ అఖిల ప్రపంచ పోర్టబుల్ ట్రాన్సిస్టరును నెలకు రూ.10/-లు చొప్పున వాయిదాల పద్ధతిని తెప్పించుకోండి. భారతదేశంలో ప్రతి పల్లెకూ, పట్టణానికి కూడ పంపగలము.

వివరములకు:

**JAPAN AGENCIES (CM-M. 10)**
**POST BOX 1194 ,, DELHI-6**

విశాలమైన సోవియట్ దేశంలో పర్యటించండి
వివిధ తావులలోని మనోహర దృశ్యాలు చూసి ఆనందించండి
ఈ అనుభవం అంతా యిల్లు కదలకుండానే పొందవచ్చు
ఈ పత్రికకు చందా కడితే చాలు!

# సోవియట్ భూమి

సోవియట్-భారత మైత్రికి సంబంధించిన వివిధ అంశాలను
చిత్రించే పత్రిక; సోవియట్ జీవితం, సంస్కృతిలోని
రమణీయకతను ప్రతిబింబించే దర్పణం.

| చందా రేట్లు : | ఏడాదికి | మూడేళ్లకు |
| --- | --- | --- |
| ఇంగ్లీషులో | రూ. 7.00 | రూ. 14.00 |
| తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం మొదలైన భారతీయ భాషలలో | రూ. 6.00 | రూ. 12.00 |

పూర్వపు చందాదారులు మళ్లీ చందా కట్టినట్టయితే, అదనంగా రెండు రూపాయల తగ్గింపు.

చందాదారులందరికీ అందమైన రంగు రంగుల క్యాలెండర్ బహుమతి.

మూడేళ్ళ చందాదారులకు క్యాలెండర్‌తోబాటుగా ఆకర్షణీయమైన జేబు దినచర్య పుస్తకం బహుమతి.

అధికారం పొందిన స్థానిక ఏజెంట్లద్వారా చందా కట్టండి; లేదా పైకం నేరుగా యీ దిగువ చిరునామాకు పంపండి :

సోవియట్ భూమి కార్యాలయం,
44, త్యాగరాయ రోడ్,
మద్రాసు - 17.

# సవ్యమైన పెంపకానికి రక్తి బోర్న్‌విటా శక్తి !



ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు..వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటలల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు — క్యాడ్‌బరిస్






Bensons/0391 TEL

**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

నాలుగు నెలల వ్యవధిలో నలుగురు అమెరికనులు చంద్రగోళం మీద అడుగు పెట్టారు. మానవులు ఇతర లోకాలను జయించటాని కివి మొదటి మెట్లు. ఈ పరిణామం ఎక్కడిదాకా పోతుందో ఎవరూ చెప్పలేరు. ఈ నాడు మనం లోకాంతరయానాల యుగంలో ఉన్నం దుకు ఎంతో గర్వపడవచ్చును. పురాణాలలో మానవులు లోకాంతరాలకు వెళ్ళినట్టు కథలున్నాయి గాని, అందులో ఉన్న కష్టసుఖాలు ఈ నాడు మనకు స్పష్టంగా తెలుస్తున్నాయి.

సంపుటి 45 డిశంబర్ '69 సంచిక 6







CHITRA



# మట్టిపట్టితే బంగారం

ఒక రైతుకు ఒక కొడుకు ఉండేవాడు. ఆ కుర్రవాడు చిన్నవాడుగా ఉండగానే తల్లి పోయింది. కొంత కాలానికి రైతుకూడా జబ్బుపడి, తన అవసాన కాలం సమీపిం చిందని గ్రహించి, కొడుకును పిలిచి, "నాయనా, నేను పేదవాణ్ణి కావటాన నీకు ఆస్తిపాస్తు లేమీ ఇవ్వలేను. కాని నువు మట్టి పట్టుకున్నా అది బంగారం కావాలని ఆశీర్వదిస్తున్నాను," అన్నాడు.

తండ్రి పోయాక కొడుకు తన తల్లిదండ్రు లను భక్తితో స్మరించి, కష్టపడి పనిచేయ సాగాడు. అతని కృషి ఫలించి త్వరలోనే అతనికి ఒక సొంత ద్రాక్షతోట ఏర్పడింది. ఆ చుట్టుపట్ల వున్న అన్ని తోటల కన్న అతని ద్రాక్షతోట ఎక్కువ ఫలవంతమవుతూ వచ్చింది.

కొంతకాలం గడిచాక అతను పళ్ళతోటలు కొన్నాడు; జాలారి పడవలు కొన్నాడు; నూనె గానుగలు పెట్టాడు. నూనె మీదా, చేపల వ్యాపారంలోనూ విపరీతంగా లాభాలు వచ్చాయి. త్వరలోనే అతను నగరంలోని పెద్ద ధనికులలో ఒకడయాడు. అతను ఏది తలపెట్టినా కలిసివచ్చింది. అతను భోగభాగ్యాలతో తులతూగుతూ, రాజభవనం లాంటి ఇంట్లో కాపరం చేస్తూ, ఒక సంప న్నుడి కుమార్తెను పెళ్ళాడి, ఏ లోటూ లేకుండా జీవిస్తున్నాడు.

కాని ఒకనాడు అతనికి తన అదృష్టం గురించి జంకు పుట్టింది. అతను తన ఆప్తమిత్రుడితో, "మిత్రమా, నా శక్తి సామర్థ్యాలకు మించిన అదృష్టం నాకు పట్టుకున్నది. అందుచేత నా కేమో భయంగా ఉన్నది. తేలికగా వచ్చిన లక్ష్మి తేలికగానే పోవచ్చు. పెద్దమ్మకు నాపై ఆగ్రహం రావచ్చు. ఆమె సంతృప్తి కోసం కొంత నష్టపోయే పని ఏదన్నా చేద్దామని

గ్రీకు జానపద కథ

ఉన్నది. నమ్మకంగా నష్టం వచ్చే మార్గం ఏదన్నా వున్నదేమో కాస్త ఆలోచించి చెప్పు," అన్నాడు.

అతని మిత్రుడు కొంచెం ఆలోచించి, "ఖర్జూరాలు ఎక్కడి నుంచి వస్తాయి ?" అని అడిగాడు.

"కైరో నుంచే గద!" అని జవాబిచ్చాడు మనవాడు.

"ఇకనేం? ఇక్కడ దొరికినంత ఖర్జూరం వీలయినంత హెచ్చు ధరకు కొను. దాన్ని ఒంటెల మీద కైరోనగరానికి తీసుకుపోయి, అక్కడ పలికే తక్కువ ధరకు పోటీపడి అమ్ము. నీకు నమ్మకంగా నష్టం వస్తుంది," అన్నాడు మిత్రుడు.

ఈ సలహా మనవాడికి నచ్చింది. అతను మర్నాడు నగరంలోని వర్తకుల వద్ద ఎంత ఖర్జూరం ఉంటే అంతా కొనేశాడు. ధర కూడా చాలా హెచ్చుగానే ఉన్నది. తరవాత అతను కొన్ని ఒంటెలను కిరాయికి తీసుకుని, ఖర్జూరాల గంపలు వాటిమీది కెక్కించి, కైరోకు ప్రయాణమై వెళ్ళాడు.

చాలా రోజులు ఎడారి మీదుగా ప్రయాణం చేసి అతను పిరమిడ్లు ఉండే ప్రాంతానికి చేరుకుని, వాటిని చూసి ఆశ్చర్యపోతూ నిలబడి ఉన్నాడు. అదే సమయంలో, ఒక




తెల్లగుర్రం ఎక్కి ఈజిప్టుదేశపు రాజు అటుగా వచ్చాడు. ఆయన వెంట ఆయన పరివారమూ, అనేకమంది సైనికులూ ఉన్నారు. సైనికు లందరి చేతుల్లోనూ జల్లెడ లున్నాయి!

మనవాడు రాజుకు నమస్కారం చేసి, "ప్రభూ, ఈ సైనికు లందరూ జల్లెడలతో వచ్చారు, ఏమిటి విశేషం ?" అని మర్యాదగా అడిగాడు.

దానికి రాజు, "ఏం చెప్పమన్నావు? ఈ రోజు ఉదయం నేను ఇటువైపుగా గుర్రం మీద షికారు వచ్చాను. నా పెళ్ళి ఉంగరం ఎక్కడో పడిపోయింది. అది నాకు

ప్రాణప్రదమైన ఉంగరం. అది దొరికినదాకా ఈ ప్రాంతాన గల ఇసక యావత్తూ జల్లెడ పట్టించ దలిచాను," అన్నాడు.

ఆయన మనవాణ్ణి, "కైరోకు ఏం పని మీద పోతున్నావు?" అని అడిగాడు.

"కైరోలో ఖర్జూరాలు అమ్ముదామని బయలుదేరాను," అన్నాడు మనవాడు, ఒంటెల మీద ఉన్న ఖర్జూరాల తట్టలను రాజుకు చూపిస్తూ.

రాజు నిర్ఘాంతపోయి, "కైరోలో ఖర్జూరాలా అమ్ముతావు? దగ్గరలో వున్న ఈ ఖర్జూరచెట్ల కేసి ఒకసారి చూడు, ఎలా విరగకాశాయో! ఒక్క చెట్టు కాయలు కొయ్యడానికి ఒక్కరోజు చాలదు. నీవు నీ సరుకు తీసుకుపోతే బుట్టకు ఒక రాగి నాణెం పైన రాదు. నువు చాలా నష్టపోతావు," అన్నాడు.

ఈ మాటలకు రాజు వెంట ఉన్న వారంతా గొల్లున నవ్వారు.

మనవాడు తాను నష్టపోవటానికే సిద్ధంగా ఉన్నానని చెప్పి, "మీరు అంటున్నారుగాని, నాకు నష్టం రాదేమో నన్న భయం ఉండనే ఉన్నది. మా నాన్న చనిపోతూ చేసిన దీవన ఫలితంగా, నే నిలా మట్టి పట్టుకుంటే అది బంగార మవుతున్నది," అంటూ వంగి గుప్పెడు ఇసుక తీశాడు.

అతను చెయ్యి విప్పేసరికి ఇసుక జారిపోయి అతని అరిచేతిలో బంగారు ఉంగరం మిగిలింది.

"అదే నేను పోగొట్టుకున్న ఉంగరం!" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

ఆయన మనవాడి అదృష్టరేఖను మెచ్చుకుని, తన ఉంగరం తేలికగా తనకు దొరికేటట్టు చేసినందుకుగాను అతనికి ఎన్నో విలువగల కానుక లిచ్చి, తిప్పిపంపేశాడు.

నష్టం కోసం వెళ్ళినవాడు కాస్తా మరింత లాభం చేసుకుని మనవాడు తన ఇంటికి తిరిగి వచ్చేశాడు.





# గాడిదచేసినమేలు

మొరాకో దేశంలో ఒక నగరం బయట ఒక బావి ఉండేది. నగరంలోవాళ్ళు అక్కడికి వచ్చి నీరుపట్టుకు పోయేవాళ్ళు. ఒకనాడు ఆ బావి ఉండే ప్రాంతంలో ఒక ఖర్జూరచెట్టు కింద మన్సూర్ అనే యువకు డొకడు కూర్చుని, నీళ్ళకోసం వచ్చే పోయే వారిని చూస్తున్నాడు. అతను బొత్తిగా ఒంటరి గాడు. అతని తల్లిదండ్రులు పోయారు. దూరగ్రామంలో ఒక పెత్తండ్రి తప్ప అత నికి ప్రపంచంలో బంధువు లెవరూ లేరు.

ఒక యువతి బావి వద్దకు వచ్చి, తన కడవ నింపుకుని, ముఖానికి అడ్డం ఉన్న మేలిముసుగు తొలగించి మంచినీరు తాగింది.

మన్సూర్ ఆ పిల్లను చూస్తూనే గాఢంగా ప్రేమించాడు. ఈ జన్మకు తాను మరొక స్త్రీ కేసి చూడలేనని అనిపించింది. అందు చేత అతను ఆమెను అనుసరించి, నగరంలో ఉండే ఆమె ఇంటికి వెళ్ళాడు.

ఆ పిల్లపేరు అమీనా. ఆమె తండ్రి వర్తకుడు. మన్సూర్ ఆయనను కలుసు కుని, "మీ కుమార్తెను పెళ్ళాడగోరు తున్నాను," అన్నాడు.

అమీనా తండ్రి అతన్ని చూసి చిరాకు పడలేదు. మన్సూర్ అందగాడూ, బుద్ధి మంతుడూనూ.

"చూడు, నాయనా! మా అమ్మాయిని ఇంకా చాలామంది పెళ్ళాడ గోరుతున్నారు. నేను కూడా ఏదో ఒక సంబంధం త్వర లోనే స్థిరం చెయ్యాలి. అమీనాను నీకు స్థిరం చెయ్యటానికి నా కేమీ అభ్యంతరం లేదు. కాని ఒక్క షరతు—నా పిల్లకు కట్నం ఇచ్చి తీరాలి. అయిదువందల తులాల వెండి ఇచ్చావంటే, నీకే పిల్ల నిస్తాను," అన్నాడు వర్తకుడు.

మన్సూరు దగ్గిర ఉన్న వెండి అంతా కలిపితే ముప్పైతులాలు మించి లేదు.

ఎల్. వినాయకరావు



"అయిదువందల తులాల వెండి అంటే కాస్త పెద్ద మొత్తమే. కొంచెం వ్యవధి ఇవ్వగలరా?" అన్నాడు మన్సూర్.

"అటే ఇవ్వలేను. పదిరోజులు గడు విస్తాను. ఈ పది రోజులలోగా డబ్బు పుట్టించలేకపోతే మళ్ళీ రావలసిన పని లేదు," అన్నాడు అమీనా తండ్రి.

పదోరోజున మళ్ళీ కనిపిస్తానని చెప్పి మన్సూర్ వచ్చేశాడు. అతను దీర్ఘాలోచనలో పడి వీధులన్నీ తిరగసాగాడు. తనకు నాలుగువందలడెబ్భై తులాల వెండి ఎవరు అరువిస్తారు? దాన్ని తాను ఎంతకాలానికి తీర్చగలడు?

ఇలా ఆలోచిస్తూండగా మన్సూరుకు తన పెత్తండ్రి జ్ఞాపకం వచ్చాడు. ఆయన ఎక్కడో దూరాన ఒక గ్రామంలో ఉన్నాడు. ఆయనను మన్సూర్ ఎన్నడూ చూడలేదు. అయినా ఆయన మన్సూర్ అవసరం గుర్తించి వెండి అరువివ్వవచ్చు!

ఈ ఆశతో ఉత్సాహం పొంది మన్సూర్ కాలినడకన పెత్తండ్రిగారి ఊరికి బయలుదేరాడు. దారిలో పొద్దూకితే ఆ రాత్రి దారి పక్కనే పడుకుని, తెల్లవారగానే లేచి, గ్రామం చేరి, కనిపించిన మొదటివాణ్ణి, "ఫలానావారిల్లు ఎక్కడ?" అని అడిగాడు.

"ఈ సందు వెంబడే వెళితే, కుడి పక్కన ఇల్లు కనిపిస్తుంది. గుర్తు పట్టటం తేలికే. ప్రహరీగోడ కొంత పడిపోయి ఉన్నది. ఇల్లు పూర్తిగా కూలటానికి సిద్ధంగా ఉన్నది," అని ఆ మనిషి గుర్తు చెప్పాడు.

ఆ ఇంటిని చూసినదాకా మన్సూరుకు తన పెత్తండ్రి డబ్బున్నవాడనే నమ్మకం ఉంటూ వచ్చింది. ప్రహరీగోడ కూలిపోవటమే గాక ఆవరణ నిండా రాళ్ళు, ఉప్పలూ, చెత్తా ఉన్నాయి. ఇంటి ముందు కట్టివేసి ఉన్న తెల్లగాడిద ఒకటి ఎముకలు వెళ్ళుకొచ్చి, అస్థిపంజరంలాగున్నది. అది మన్సూర్ కళ్ళలోకి సూటిగానూ, ఆశగానూ

చూసింది. "నా కింత తిండి పెట్టలేవా?" అని దానికళ్లు స్పష్టంగా అడుగుతున్నాయి.

దాన్ని చూడగానే మన్సూరుకు జాలి కలిగింది. ఆ గాడిదకు వయసు అటే లేదు ; తిండిలేక అది శల్యామై ఉన్నది.

మన్సూర్ బయటికి వెళ్ళి, ఒక గడ్డి కట్టను కొనుక్కొని వచ్చి, గాడిద ముందు పడేశాడు. గాడిద పరమానందంతో సకి లించి, ఆత్రంగా గడ్డి తినసాగింది. మన్సూర్ లోపలికి వెళ్లి పెత్తండ్రిని కలుసుకున్నాడు.

మన్సూరును చూసి అతని పెత్తండ్రి పెద్ద పెట్టున సంతోషించినట్టు కనబడలేదు. భోజనానికి అయన ఒక రొట్టె మాత్రమే తెచ్చుకుని, అందులో నుంచి ఒక చిన్న తుంపు మన్సూరు కిస్తూ, "నేను చాలా బీదవాణ్ణి," అన్నాడు.

"నీకు బాగా డబ్బున్నదని చెప్పారు. నే నిప్పుడు వచ్చింది కూడా నీ వద్ద కొంత డబ్బు అప్పుతీసుకుందామనే," అన్నాడు మన్సూర్.

"అప్పా? నా దగ్గిర ఏముంది ఇవ్వ టానికి? కటిక పేదవాణ్ణి!" అన్నాడు పెత్తండ్రి.

"అల్లా నిన్ను దయ జూచు గాక!" అన్నాడు మన్సూర్.




మర్నాడు అతను బయలుదేరదామను కుంటూండగా పెత్తండ్రి, "నువు కూడా తోడు రా. గాడిదను సంతలో అమ్మేద్దాం. అది మేత దండుగగా ఉన్నది," అన్నాడు.

ఇద్దరూ గాడిదను సంతకు తీసుకు పోయారు. దానికి పదితులాల వెండి దాకా ధర పలికింది. ఆ గాడిద తన కేసి మనిషి చూసినట్టు చూస్తూ ఉండటం మన్సూర్ గమనించాడు. దాని కళ్లు, "నన్ను నువే కొనుక్కో!" అని అడుగుతున్నాయి.

మన్సూర్ ముందూ వెనకా ఆలోచించ కుండా, "పెదనాన్నా, నీ గాడిదను నాకే అమ్ము!" అనేశాడు.

"అలాగే కొనరా, బాబూ. ఇరవై తులాల వెండికి అమ్మేస్తాను," అన్నాడు పెత్తండ్రి. బేరం ఆడటానికి కూడా లేదు.

"నాతోపాటు మా ఇంటికి వచ్చి సొమ్ము తీసుకో," అన్నాడు మన్సూరు.

ఇద్దరూ నగరానికి వచ్చారు. మన్సూరు తన దగ్గిర ఉన్న ముప్ఫైతులాల వెండిలో ఇరవై తులాలు పెత్తండ్రికి ఇచ్చి, తాను మరింత పేదవాడైపోయాడు.

అతని పెత్తండ్రి ఆ సొమ్ము రొండిన పెట్టుకుని తన గ్రామానికి పోతూండగా దొంగలు ఆయనను చంపేసి, సొమ్ము కాజేశారు.

తనకున్న ఒక్క బంధువూ పోయాడని తెలియగానే, మన్సూర్ తెల్లగాడిద మీద పెత్తండ్రి గ్రామానికి బయలుదేరాడు. ఎందుకంటే ఆ పోయినవాడికి ఉత్తరక్రియలు చేసే బాధ్యత అతనిపైనే ఉన్నది.

ఈ సారి మన్సూర్ తన పెత్తండ్రి ఇల్లు శ్రద్ధగా గాలించాడు. అది నిజంగానే పేద కొంప ఎక్కడా ఎర్రఏగానీ దాచిపెట్టిన లక్షణాలు కానరాలేదు.

మన్సూర్ బయలుదేరబోతూండగా, గాడిద ఇంటి గోడను సమీపించి, ఒకచోట ముందుకాలితో మట్టిని గోరసాగింది.

"డబ్బు!" అన్న ఆలోచన మన్సూర్ తలలో మెరిసింది. అతను పొరుగువాళ్ళ దగ్గిర ఒక పార అడిగి తెచ్చి, గాడిద గోరిన చోట తవ్వ నారంభించాడు. ఒక అడుగు లోతున ఒక పెట్టె దొరికింది. దానిలో కనీసం అయిదువేల తులాల వెండి ఉన్నది.

మన్సూర్ సమస్యలన్నీ ఒక్క దెబ్బతో తీరిపోయాయి. అతనా పెట్టెను గాడిద మీద పెట్టుకుని నగరం చేరి, అయిదువందల తులాల వెండి తూయించి అమీనా తండ్రి వద్దకు వెళ్ళాడు.

"అల్లా కటాక్షం!" అంటూ ఆ వర్తకుడు వెండి స్వీకరించి, అమీనాను మన్సూరుకిచ్చి పెళ్ళి చేసేశాడు.






# శిధిలాలయం

## 24

[ చిరుతపులీ, మొసళ్ళ బారినుంచి జాంగ్‌లాను శిధిలాలయ పూజారి ముఠా రక్షించారు. ఆ రాత్రి కొండచరియ ప్రాంతాన నిద్రిస్తున్న శిఖిముఖినీ, అతడి అనుచరులనూ ఇభ్యు జాతివాళ్ళు పట్టుకుని తమ పల్లెకు తీసుకుపోయారు. వాళ్ళ కులపెద్ద కాళీమాతకు బలి యిచ్చేందుకు శిఖిముఖి అనుచరులను తమ నాయకుడెవరో చెప్పమన్నాడు. తరవాత—] ·

ఇభ్యుల కులపెద్ద, శిఖిముఖీ వాళ్ళను అడిగిన ప్రశ్న వింటూనే శిధిలాలయ పూజారి మహదానంద పడిపోయాడు. అతడికి, యీ దెబ్బతో శిఖిముఖి కాళీ మాతకు బలి అయిపోతాడనీ, ఆ ఆటవికుడి సహాయం కోల్పోయిన విక్రమకేసరిని తేలిగ్గా హత మార్చవచ్చనీ అనిపించింది.

"ఇభ్యు నాయకా! మీరు వాళ్ళను ఆ ప్రశ్న అడగ నవసరం లేదు. వాళ్ళ నాయకు డెవరో తెలుస్తూనే వున్నదిగదా—ఆ ఆటవికుడు శిఖిముఖి శిధిలాలయం పేరుతో ధనాశ చూపి తతిమ్మా ముగ్గురినీ యింత దూరం తీసుకువచ్చాడు," అన్నాడు శిధిలాలయ పూజారి.

పూజారి మాటలు వింటూనే ఇభ్యు కులపెద్ద కోపంగా తల తిప్పి అతడి కేసి చూశాడు. ఇభ్యు మాంత్రికుడు తన చేతి లోని దండంతో పూజారి వీపుమీద పొడిచి,




"కులపెద్ద అనుమతి ముందుగా తీసుకుని తరవాత మాట్లాడాలి! ఆపాటి మర్యాద కూడా నీకు తెలియదా?" అన్నాడు.

పూజారి చిన్నగా మూలిగి చేత్తో వీపు తడువుకున్నాడు. ఇభ్యు కులపెద్ద మరోసారి మొదట వేసిన ప్రశ్నను శిఖిముఖీ, విక్రమ కేసరుల కేసి చూస్తూ గట్టిగా అడిగాడు. విక్రమకేసరి ఏదో జవాబు చెప్పబోయేంతలో శిఖిముఖి అతణ్ణి వారించి, "పూజారి చెప్పి నట్టు నేనే యీ అందరికీ నాయకుణ్ణి. కాని, అతడన్నట్టు నేను వీళ్ళను ధనాశ చూపి యింత దూరం తీసుకురాలేదు. మేము యీ ప్రాంతాలకు వచ్చింది విక్రమకేసరి అనే మా మహారాజు కోసం. ఆయన యీ ప్రాంతల ఎక్కడో వున్నాడని సమాచారం అందింది," అన్నాడు.

'విక్రమకేసరి' అన్న మాట వింటూనే ఇభ్యు కులపెద్ద ఉలిక్కి పడ్డాడు. అది గమనించిన పూజారి, "ఇభ్యునాయకా, మీ అనుమతితో మాట్లాడుతున్నాను. విక్రమ కేసరి మహారాజు రాకాపోకా అంతా ఏళ్ళూ పూళ్ళూనాటి మాట గదా? వీళ్ళు ఆయన పేరు ఎక్కడో విని, ఆ పేరు చాటున కపట నాటకం ఆడుతున్నారు. వీళ్ళు నిజంగా వచ్చింది, శిధిలాలయంలోని వెండి బంగారాలు దోచుకు పోయేందుకు," అన్నాడు.

ఇభ్యు కులపెద్ద తలాడించి ఒకటి రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, తరవాత శిఖి ముఖిని, "మిమ్మల్ని గురించి నాకు సర్వం తెలుసు. అనవసర ప్రసంగం వద్దు. మీలో నాయకు డెవరు?" అని అడిగాడు కఠినంగా.

"చెప్పాను గదా, నేనే నాయకుణ్ణి! నాపేరు శిఖిముఖి!" అంటూ శిఖిముఖి ఒకడుగు ముందుకు వేశాడు.

విక్రమకేసరి అతడి భుజం పట్టుకుని లాగుతూ, "నేను రాజవంశంవాణ్ణి, క్షత్రియుణ్ణి! నాకు ఆటవికుడు నాయకు డెలా

కాగలడు? వీళ్ల ముగ్గురికీ నాయకుణ్ణి నేను. నా పేరు విక్రమకేసరి. ఆ కాళీమాతకు నన్నే బలి పెట్టండి. కాని, బలి అయిపోయే ముందు మీలో కొందరినైనా బలి పుచ్చుకు తీరతాను," అన్నాడు రౌద్రంగా.

శిథిలాలయ పూజారి పెద్దగా నవ్వుతూ, "ఎంత మోసం! తన పేరు విక్రమకేసరి అని పచ్చిఅబద్ధం ఆడేస్తున్నాడు. పైగా ఇభ్యజాతివాళ్ళను బలి పుచ్చుకుంటాడట! అహ్హహ్హ!" అన్నాడు.

విక్రమకేసరి మాటలు ఇభ్య కుల పెద్దకు బాగా కోపం తెప్పించినై. అతడు తన అనుచరుల్ని హెచ్చరిస్తూ, "ఈ శిఖిముఖీ, విక్రమకేసరులమని చెప్పుకునే వాళ్ళిద్దరూ చాలా ప్రమాదకారుల్లా వున్నారు. తక్షణం యిద్దర్నీ కాళీమాతకు బలి చెయ్యండి. మిగతా యిద్దరి సంగతీ తరవాత ఆలోచిద్దాం. నడవండి, కాళీమాత ఆలయానికి," అంటూ ఆసనం మీదినుంచి లేచి బయలుదేరాడు.

శిఖిముఖీ, విక్రమకేసరీ ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళకు ఇక ఇభ్యకుల పెద్దతో మాట్లాడి ప్రయోజనం లేదన్నభావం కలిగింది. తమకు మరణం ఎలాగూ తప్పదు, కాని వెంట వచ్చిన అజిత వీర



భద్రులు అనవసర కష్టాలపాలు అవుతారన్న భయం యిద్దర్నీ బాధించసాగింది.

ఇభ్య కులపెద్ద వెనకగా అందరూ చుట్టు గుడిసె నుంచి బయిటికి వచ్చి, పెద్ద వీధి వెంట కొంతదూరం నడిచి, గ్రామానికి అల్లంత దూరంలో ఒక ఎత్తయిన ప్రదేశంలో వున్న కాళికాలయాన్ని చేరారు.

ఇభ్య మాంత్రికుడు చేత కత్తి పట్టుకుని, భయంకర రూపంలో వున్న కాళికాదేవి విగ్రహం ముందుకు పోయి, పెద్ద స్వరంతో ఏవో మంత్రాలు చదివి, "కట్లువిప్పి ఇక ఆ శిఖిముఖి, విక్రమకేసరి అనేవాళ్ళను దేవి ముందుకు తీసుకురండి," అన్నాడు.



మాంత్రికుడి ఆజ్ఞ శిథిలాలయ పూజారికి చాలా సంతోషం కలిగించింది. అతడు ఇభ్యు కులపెద్ద పక్కన చేరి పనిలో పనిగా అజిత వీరభద్రుల్ని కూడా దేవికి బలి పెట్టటం బావుంటుందని సలహా యిచ్చాడు. దానికి కులపెద్ద అవును కాదన్నట్టుగా తల వూపసాగాడు. అతడి దృష్టి విక్రమకేసరి మీదే కేంద్రీకరించబడి వున్నది. విక్రమకేసరి ముఖకవళికల్లో అతడికి తాను బాగా ఎరిగిన ఒక వ్యక్తి ముఖలక్షణాలు ఛాయా మాత్రంగా కనిపించసాగినై.

శిఖిముఖీ వాళ్ళను కొండచరియ దగ్గిర పట్టుకున్న ఇభ్యు దళనాయకుడు, శిఖిముఖినీ, విక్రమకేసరినీ సమీపించి వాళ్ళ భుజాలు పట్టుకుని, కత్తిఎత్తి సిద్ధంగా వున్న ఇభ్యు మాంత్రికుడి ముందుకు తోయబోయాడు. అదే అదనుగా విక్రమకేసరి గుప్పెట బిగించి ఇభ్యు దళనాయకుడి తలమీద బలంగా కొట్టాడు.

ఆ దెబ్బకు వాడు దిమ్మెరపోయి కింద పడేంతలో, శిఖిముఖి మాంత్రికుణ్ణి కాలుతో బలంగా ఒక్క తన్ను తన్నాడు. మాంత్రికుడు ఒక్క కేక పెట్టి పక్కకు పడిపోయాడు. అతడి చేతిలోని కత్తి ఎగిరి దూరంగా పడింది. శిఖిముఖి ఆ కత్తిని దొరక పుచ్చుకునేందుకు ముందు కురికేంతలో, ఇద్దరు ఇభ్యులూ, శిథిలాలయ పూజారి బంటొకడూ అతడి మీద పడి చేతులు విరిచి పట్టుకున్నారు. విక్రమకేసరి అతడికి సహాయం వెళ్ళేలోపల అతడి మీద మరి నలుగురు ఇభ్యులు వచ్చి పడి, కదలకుండా పట్టుకున్నారు.

క్షణంలో జరిగినపోయిన, యీ గందరగోళం చూసి ఇభ్యు కులపెద్దకు ఆశ్చర్యం, కోపం కూడా కలిగింది. అతడు కళ్ళెర్ర చేసి, మీసం మెలివేస్తూ శిఖిముఖి ముందుకు పోయి, అతడి మెడ పట్టుకుని, "కాళీమాత ముందు నువ్వు చేసిన అపచారానికి నిన్ను

చిత్రవధ చేయిస్తాను! ఈ విక్రమకేసరి అని చెప్పానునేవాణ్ణి....''

ఇభ్యకుల పెద్ద మాట ముగించే లోపల శిఖిముఖి తన మెడపట్టు వదిలించుకునేం దుకు విసురుగా పక్కకు తిరిగాడు. ఆ ఊపుకు ఇభ్యకుల పెద్ద చేయి పట్టుతప్పి, శిఖిముఖి మెడలో వున్న రక్షరేకు మీదపడి, తాడుతెగి, అతడి చేతిలోకి వచ్చింది.

రక్షరేకు మీద గల కాళీమాత రూపం చూస్తూనే ఇభ్యకులపెద్ద ఓ క్షణకాలం నిర్విణ్ణుడై పోయి, అంతలోనే తెప్పరిల్లి చేయెత్తి, "వీళ్ళిద్దరికీ ఎలాంటి హానీ కలిగించకండి. ఇదేదో వింతగా వుంది!" అంటూ రక్షరేకును అటూ యిటూ తిప్పి పరీక్షించసాగాడు.

శిఖిముఖీ, విక్రమకేసరులు క్షణాలమీద కాళికాదేవికి బలైపోతారని ఎదురుచూస్తున్న శిథిలాలయ పూజారికి, ఇభ్య కులపెద్ద మాటలు చాలా ఆశాభంగం కలిగించినై. అతడు జంకుతూ జంకుతూ అతణ్ణి సమీ పించి భుజం మీదుగా వంగి రక్షరేకు కేసి చూసి, పళ్ళు కొరికాడు.

"ఇభ్యనాయకా! ఇది పచ్చిమోసం! దైవద్రోహం! ఈ దేవాలయంలోని పవిత్ర మైన కాళీమాత రూపానికి, యీ నాస్తిక వెధవలు నకళ్ళు తయారుచేయించి, మెడల్లో





వేళ్లాడకట్టుకు తిరుగుతున్నారు. ఎంత అపచారం! ఎంత అపచారం!" అంటూ శిఖిముఖి కేసి దూకబోయాడు పూజారి.

ఇభ్యు కులపెద్ద అతణ్ణి చేతితో వెనక్కు నెట్టి, "కొంచెంసేపు నీ వాగుడు కట్టిపెట్టు!" అని గట్టిగా హెచ్చరించి, శిఖిముఖిని, "ఈ రక్షరేకు నీ కెక్కడ దొరికింది?" అని అడిగాడు.

శిఖిముఖి పళ్ళుకొరుకుతూ, ఇభ్యుకుల పెద్ద కేసి చూసి, "ఆ రక్షరేకు నా కెక్కడ దొరికిందో నీకు చెప్పవలసిన అవసరం ఏమిటి? ఆ రాగిముక్క గురించి నీవు తెలుసుకోవలసిందేమీ లేదు," అన్నాడు.



"దైవదూషకా! అది రాగిముక్కా? జగజ్జనని కాళీమాతనా నువ్వవమానిస్తున్నది! చూస్తారేం, వాడి తల నరకండి!" అంటూ శిథిలాలయ పూజారి అరిచాడు.

ఇభ్యు కులపెద్ద కళ్ళెర్ర చేసి, పూజారి కేసి తిరిగి, "నువ్వు కావటానికి ఇభ్యుడివైనా, ఏవో దుష్టశక్తులు సంపాయించేందుకు నీచోపాసన చేస్తూండటం తెలిసే నిన్ను కులంలో నుంచి బహిష్కరించాం. అటువంటి బహిష్కృతుడివి నివ్వు యిక్కడ పెద్దరికం చేయాలని చూశావో, ముందు నిన్ను బలిపెడతాను," అన్నాడు.

ఆ హెచ్చరికతో పూజారి అదురుకుని వెనక్కు తిరిగి, తన అనుచరులకు సౌంజ్ఞ చేశాడు. అందరూ అతడి చుట్టూ మూగారు. శిఖిముఖికి, ఇభ్యు కులపెద్ద అన్న మాటలూ, అతడు రక్షరేకును పరీక్షిస్తున్న తీరూ చూసి చాలా ఆశ్చర్యం కలిగింది. ఆ వెంటనే అతడికి ఆ రక్షరేకు విక్రమకేసరి తాతగారివయిన తాళపత్రాలు గల పెట్టెలో దొరికింది అన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. అంతే కాక దాని సాయంతో తామందరం బయటపడవచ్చునేమో నన్న ఆశకూడా కలిగింది.

శిఖిముఖి, విక్రమకేసరి కేసి చూసి అతడూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టు



గమనించి, చప్పున ఇభ్యు కులపెద్ద కేసి తల తిప్పి, "ఇభ్యు నాయకా! నీలో ఏ మూలనో కొంచెం మానవత్వం వున్నదన్న సంగతి, యింతకుముందు నీవు అన్న మాటలవల్ల గ్రహించాను. ఆ పూజారి పరమదుర్మార్గుడు. అది అలా వుంచుదాం. ఈ రక్షరేకు మా మహారాజైన విక్రమకేసరికి ఎవరో బహూకరించారు. అది ఆయన వదిలిపోయిన తాళపత్రాలు గల పెట్టెలో దొరకగా, దాన్ని ఆయన కుమారుడైన శూరసేనదేశపు రాజు జయపాలుడు నాకు స్వయంగా మెడలో కట్టాడు," అన్నాడు.




ఆ మాటలు వింటూనే ఇభ్యుకుల పెద్ద అదిరిపడి, శిఖిముఖి కేసీ, విక్రమకేసరి కేసీ, ఓమారు చూసి, ఒక్క అంగలో విక్రమ కేసరిని సమీపించి, అతణ్ణి గట్టిగా కావి లించుకుని, "నువ్వు ఆ మహారాజు విక్రమ కేసరి మనవడివా? మా జాతివాళ్ళను మహమ్మారి రోగానికి బలికాకుండా కాపాడిన ఆ మహారాజు వంశాంకురానికి ఎంతద్రోహం చేశాను!" అంటూ కళ్ళనీళ్ళు పెట్టాడు.

తమ కులపెద్ద యిలా అనగానే, అక్కడ చేరిన ఇభ్యులూ, ఇభ్యు మాంత్రికుడూ, ముందుకు వచ్చి వాళ్ళిద్దరి ముందూ చేతులు కట్టుకుని నిలబడ్డారు.

ఇభ్యు కులపెద్ద, శిఖిముఖిని దగ్గిరకు పిలిచి, సాదరంగా అతడి భుజం మీద చేయివేసి, రక్షరేకును తిరిగి అతడి మెడలో వేలాడ కడుతూ, "ఇప్పుడు మీరేం చెప్ప కుండానే, నాకు మీరు వచ్చిన పని చాలా వరకు తెలిసిపోయింది. మీరు ఆ మహారాజు సజీవుడేమో అన్న అనుమానంతో వెతు కుతూ బయలుదేరి యిక్కడికి వచ్చారు. కాని, ఆయన ఎక్కడో కొండల్లో విష జ్వరంతో చాలాకాలం బాధపడి మర ణించారు. ఆయన మీది భక్తికొద్దీ ఆయన మృతదేహాన్ని తెప్పించి, మా పూర్వుల సమాధి పక్కనే సమాధి చేయించాను.

ఈ రక్షరేకును ఆ మహానుభావుడికి కృతజ్ఞతా సూచకంగా లోగడ నేనూ, నా జాతి వాళ్ళమూ యిచ్చాము," అన్నాడు.

శిఖిముఖి ఆ మాటలకు నవ్వి, "మీరు మేం చెప్పేది సాంతం వినకుండానే మమ్మల్ని కాళికాదేవికి బలి యివ్వ జూపారు. మిమ్మల్ని అపమార్గం పట్టించిన వాడు, ఆ దుర్మార్గుడైన శిథిలాలయ పూజారి. ముందు వాణ్ణి పట్టి బంధించండి. వాడు మాకూ మీకూ కూడా చేసిన ద్రోహం చాలా వుంది," అన్నాడు.

ఇభ్య కులపెద్ద పళ్ళు కొరుకుతూ తన కులంవాళ్ళ కేసి తిరిగి, "ఆ నీచుడెక్కడ? లాక్కురండి! కాళీమాతకు బలి యివ్వండి!" అంటూ అరిచాడు.

మందిరంలో వున్నవాళ్ళంతా చుట్టూ కలయ చూశారు. అక్కడ పూజారిగాని, అతడి అనుచరులుగాని లేరు. ఇభ్య కుల పెద్దతోపాటు అందరూ, "ఆ నీచుణ్ణి పట్టుకోండి!" అంటూ మందిరం నుంచి బయిటికి పరిగెత్తుకొచ్చారు.

కాళీదేవి మందిరం వున్న గుట్టకు పక్కనే వున్న ఒక పెద్ద కొండ మీద శిథిలాలయ పూజారీ, అతడి బంట్లూ నిలబడి వున్నారు. ఇభ్యకులపెద్దను చూసి అతడు, "ఈ మహా శక్తిమంతుడు, మీకు పట్టుబడతాడా! ఇన్నాళ్ళకు నాకు శిథిలాలయం ఎక్కడున్నదో తెలిసిపోయింది. చావ వుంటే అక్కడికి రండి, మీరో నేనో తేల్చుకుందాం!" అంటూ కేక పెట్టాడు.

ఇభ్య కులపెద్ద తనవాళ్ళ కేసి తిరిగి, "ఆ సంకరజాతి వెధవను ప్రాణాలతో పట్టుకొచ్చినవాడికి నా పదో భార్య చిన్న కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు పెద్దగా.

ఇభ్య యువకులూ, నడి వయసు వాళ్ళూ పులుల్లా రంకెలు వేస్తూ, పూజారి నిలబడి వున్న కొండమీదికి వేగంగా పరిగెత్తసాగారు. —(ఇంకా వుంది)







# విధి లిఖితం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, మానవులు మూర్ఖులై, ఏటికి ఎదురీదినట్టు, విధిలిఖితాన్ని ప్రతిఘటింప జూస్తారే గాని, వారి ప్రయత్నాలు పూర్తిగా విఫలమవుతాయి. ఇందుకు నిదర్శనంగా నీకు గుణాంకు డనే రాజుకథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

లావాణపుర రాజు గుణాంకుడు దూరాన ఉన్న అరణ్యాలలో వేటాటబోయి, వేట తమకంలో తన పరివారానికి కూడా అందకుండా కీకారణ్యం మధ్య ఉండగా చీకటి పడింది. ఆ రాత్రికి ఆయన ఆ అరణ్యంలో ఉండే ఒక వేటగాడి గుడిసెలో తలదాచుకోవలసి వచ్చింది. ఆ గుడిసెలో వేటగాడూ,



అతని భార్యా, వారంరోజుల క్రితం పుట్టిన వారి బిడ్డా మాత్రమే ఉన్నారు.

వేటగాడు రాజును గుర్తించలేదు గాని, ఎవరో గొప్పవాడై ఉంటాడనుకుని, మర్యాద చేసి, తన కున్నదానిలో నే ఆ రాత్రికి భోజనం పెట్టి, రాజు పడుకునేటందుకు తోళ్ళు పరిచాడు. హంసతూలికా తల్పం మీద పడుకునే గుణాంకుడికి ఆ ఎగుడుదిగుడు నేల మీద పరిచిన తోళ్ళు ఏమాత్రమూ నిద్ర పట్టనివ్వలేదు. తెల్లవారుఝామున కాస్త కలతనిద్ర పట్టేసరికి రాజుకు కల వచ్చింది. ఆ కలలో ఎవరో అస్పష్టంగా కనిపించి, "రాజా, ఈ గుడిసెలో ఉన్న పసిగుడ్డు ఎవరనుకున్నావు? నీకు కాబోయే కోడలు. ఈమె లోకోత్తర సుందరి అవుతుంది," అన్నట్టు తోచింది.

రాజు నిర్ఘాంతపోయి లేచి కూర్చున్నాడు. ఈ వేటగాడి కూతురు తనకు కోడలు కావట మేమిటి? తన బొందిలో ప్రాణం ఉండగా అలా జరగటానికి వీల్లేదు. ఇది విధిలిఖితమైతే దాన్ని తప్పించటం తన చేతిలో ఉన్న పని!

బాగా తెల్లవారినాక రాజు తన రాజధానికి ప్రయాణమవుతూ, వేటగాడితో, "నే నీ దేశపు రాజును. మీ పిల్ల ఈ అరణ్యంలో పెరిగి ఏం బాగుపడుతుంది? దాన్ని నాకు ఇచ్చేస్తే నేను మా రాజభవనంలో ఉంచి పెంచి, పెద్దదాన్ని చేసి, మీ ఋణం తీర్చుకుంటాను," అన్నాడు.

రాజిలా అంటూంటే ఏమి సమాధానం చెప్పాలో వేటగాడికి గాని, వాడి భార్యకు గాని తోచలేదు. చివరకు వేటగాడు చేతులు నులుపుకుంటూ, "తమ చిత్తం!" అన్నాడు. అతని భార్య ఆ పసిగుడ్డును పొత్తిళ్ళలో చుట్టి రాజుచేతికి అందించింది. ఆ మూటతో సహా రాజు తన గుర్రాన్నెక్కి బయలు దేరాడు. ఆయన కొన్నిమైళ్ళు వెళ్ళాక తన చేతిలో ఉన్న మూటను దారిపక్కన

పొదలలోకి విసిరివేసి, "ఇక నా కోడలివి ఎలా అవుతావో చూస్తాను," అనుకుంటూ తన నగరుకు వెళ్ళిపోయాడు.

తరవాత కొంత సేపటికి అటుగా ఒక రైతు వచ్చాడు. అతనికి పొదల మధ్య నుంచి చంటిబిడ్డ ఏడుపు వినిపించింది. వెళ్ళి చూస్తే గుడ్డలచుట్ట లాగా ఉన్నది; ఆ గుడ్డలమధ్య పసిగుడ్డు కనిపించింది.

చాలా కాలంగా బిడ్డల కోసం ముఖం వాచిన ఆ రైతుకు ఆ బిడ్డను చూడగానే పరమానంద మయింది. అతనా బిడ్డను తీసుకుపోయి తన భార్య కిచ్చాడు. ఆ విధంగా వేటగాడి కూతురు రైతు ఇంట మూడేళ్ళ పాటు అల్లారుముద్దుగా పెరిగింది. ఆ పిల్లకు వాణి అని పేరు పెట్టారు.

అంతలో మళ్ళీ రాజు రైతు ఉండే పల్లెకు రావటం తటస్థించింది. రైతు ఆయనకు తాగటానికి పాలు ఇచ్చాడు. రాజు రైతు ఇంట పెరుగుతున్న వాణిని చూసి, "మీ పిల్ల చాలా అందంగా ఉన్నది," అని అభినందించాడు.

"వాణి మా కన్నకూతురు కాదు, మహారాజా. ఎవరో కని పారేసిన బిడ్డ, మూడేళ్ళ క్రితం పసిగుడ్డుగా మాకు పొదల్లో దొరికింది. అయినా మేము దీన్ని సొంత బిడ్డగానే పెంచుకుంటున్నాం," అన్నాడు రైతు.





రాజు గతుక్కుమన్నాడు. ఆ వేటగాడి పిల్ల ఎప్పుడో చచ్చిపోయి ఉంటుదను కున్నాడు, కాని అలా జరగలేదు. విధికీ తనకూ పోటీ జరుగుతున్న దన్నమాట. ఈ పోటీలో తాను నెగ్గితీరాలి.

"ఈ పిల్లను నేనే పెంచుకుంటాను. మీ ఇంట కన్న మా రాణివాసంలో ఎన్నో రెట్లు సుఖంగా బతుకుతుంది. ఏమంటావు?" అని రాజు రైతు నడిగాడు. పిల్లను రాజు కివ్వటం రైతుకుగాని, అతని భార్యకుగాని ఏ మాత్రమూ ఇష్టంలేదు. అయినా రాజు మాట కాదనటానికి లేదుగనక, "చిత్తం, అలాగే చెయ్యండి," అన్నాడు రైతు.

రాజు వాణిని తన గుర్రంమీద ఎక్కించుకుని బయలుదేరి, దారిలో తగిలిన చిన్న నదిలోకి ఆమెను తోసి, తనదారిన తాను వెళ్ళిపోయాడు. వాణి నీటిలో కొంత దూరం కొట్టుకుపోయి, పొరుగున ఉన్న రాజ్యంలో రేవు చేరింది. ఆ సమయానికి ఆ దేశపు రాణి రేవుకు స్నానానికి వచ్చి, నీటిలో కొట్టుకు వస్తున్న పిల్లను చూసి, తన నౌకర్ల చేత తీయించింది.

స్పృహ తప్పిన వాణికి కొంత సేపటికి స్పృహ రాగానే, "నీ పేరేమిటమ్మా?" అని రాణి అడిగితే, వాణి అని ఆ పిల్ల సమాధానం చెప్పింది.

ఆ పిల్ల అందం చూసి రాణి ముగ్ధురాలై, తనకు అడపిల్లలు లేనందున వాణిని తన కుమార్తెలాగే పెంచి పెద్ద చేసింది. యుక్త వయసు వచ్చేసరికి వాణి అద్భుత సౌందర్యవతిగా తయారయింది.

ఆ సమయంలో ఒకసారి లావాణదేశపు రాజకుమారుడు ఈ దేశానికి రావటం తటస్థించింది. ఆ యువకుడు వాణిని చూడగానే ఆమెను ఎంతో ప్రేమించి, పెళ్ళి చేసుకుంటా నన్నాడు. వాణిని పెంచిన రాణి అభ్యంతరం చెప్పలేదు గాని, వాణి తన గర్భవాసాన పుట్టిన పిల్లకాదనీ, తనకు



మూడేళ్ళ పిల్లగా ఏట్లో కొట్టుకుపోతూ దొరికిందనీ, అందుకు అభ్యంతరం లేకపోతే పెళ్లి విషయం నిర్ణయించుకోమనీ రాజకుమారుడితో అన్నది.

"మా నాన్నగారి అనుమతి తీసుకువచ్చి పెళ్ళాడతాను. వాణి మీ కన్న కుమార్తె కాకపోయినా నా కేమీ అభ్యంతరం లేదు," అని రాజకుమారుడు తన తండ్రి వద్దకు వెళ్లి విషయాలన్నీ చెప్పాడు.

గుణాంకుడు అంతా విని నిర్ఘాంతపోయాడు. విధిదే పైచెయ్యి అవుతుందని ఆయన అనుకోలేదు. ఆయన తన కొడుకుతో, "నే నీ పెళ్ళికి ఎంతమాత్రమూ ఒప్పను. నా తరవాత సింహాసనం మీద కూర్చోవలిసినవాడివి కులగోత్రాలు లేని దాన్ని ఎలా పెళ్ళాడతావు?" అన్నాడు.

రాజకుమారుడు తండ్రిపై తిరగబడి, "నేను వాణిని పెళ్ళాడటానికి మీ సింహాసనమే అడ్డమైతే అది నాకు అవసరం లేదు. నేను వెళ్లి నేను వరించిన కన్యను పెళ్లాడుతున్నాను. మీరు నన్ను ఆహ్వానిస్తేనే గాని నేను తిరిగి ఈ దేశంలో అడుగుపెట్టను," అంటూ వాణి ఉన్న చోటికి వెళ్లిపోయాడు.

రాజు తన ఓటమి పూర్తి అయినట్టు గ్రహించాడు. ఆయన తన కొడుకు వివాహానికి హాజరైనాడు. పెళ్ళి పీటల మీద తన కొడుకునూ, కోడలినీ చూడగానే ఆయనకు ఆశ్చర్యం వేసింది. వాణి కన్న అందమైన కోడలూ, రాజరీవి గలదీ నూరేళ్లు వెతికినా తనకు దొరకదు. ఈ వివాహానికి చాలామంది రాజులు వచ్చారు. అందరూ వాణిని మెచ్చుకున్నవాళ్ళే. ఇన్నేళ్ళుగా తాను ఈ వివాహం జరగకుండా ఉండగలందులకు అన్ని పాట్లు ఎందుకు పడినదీ రాజుకు అర్థం కాలేదు. ఆయన తన కొడుకునూ కోడలినీ తన రాజధానికి తీసుకుపోయి, అరణ్యంలో ఉన్న వేటగాణ్ణీ అతని భార్యనూ పిలిపించి, "ఇదిగో మీరు

కన్న పిల్ల! నా కోడలయింది," అనీ, రైతునూ, రైతు భార్యనూ పిలిపించి, "ఇదిగో మీరు పెంచిన వాణి! నా కొడుక్కు చేసుకున్నాను," అనీ చెప్పి, వారందరికీ తన నగరంలో నివాసాలు ఏర్పాటు చేశాడు. వాళ్ళందరూ, "ఇంతా రాజుగారి చలవే!" అనుకున్నారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, విధి లిఖితం ముందే తెలిసి కూడా రాజు దాన్ని తప్పించడానికి అన్ని పాట్లెందుకు పడ్డాడు? నిజంగా తాను విధిలిఖితాన్ని మార్చగలననేనా? అలాంటివాడు చివరకు విధిలిఖితాన్ని ఎందుకు ఆమోదించాడు? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మానవుడు చేసే ప్రయత్నమంతా తన ఇచ్ఛను కొనసాగించటానికే. సమర్థులైన వారెవరూ పరిస్థితులకు తల ఒగ్గరు. రాజుకు విధిలిఖితం ముందుగా తెలిసిన కారణంచేత అతను దాన్ని తప్పించాలని మరింత పట్టుదల వహించాడు. అది ఆయనలో విశేషమే గాని తప్పు పట్టదగినది కాదు. వేటగాడి కుమార్తె తన కోడలవుతుందని ముందుగా తెలియనట్టయితే, వివాహ సమయంలో ఆ సంగతి తెలిసినా రాజు అభ్యంతరం చెప్పి ఉండడు. ఆ సమయానికి వాణి ఆయన కోడలు కావటానికి అర్హురాలుగానే ఉన్నది. కాని వేటగాడి ఇంట ఉండిన పసిగుడ్డు తనకు కోడలు కావటానికి ఎంతమాత్రమూ అర్హురాలుగా లేదు. మరొక విషయ మేమిటంటే విధి లిఖితం ప్రకారం జరగటానికి రాజే రెండు సార్లు సాధనమయాడు. అలా విధి చేతి కీలుబొమ్మ కావటానికి ఎంతటి వాడికీ అభ్యంతరం ఉండదు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# సర్వనాశనం

శబరవన ప్రాంతంలో ఒక రైతు ఉండే వాడు. అతను వ్యవసాయం చెయ్యటానికి వనమంతా తిరుగుతూ ఉండగా ఒకచోట మొక్కజొన్నా, కందా పండించటానికి అను వైన ప్రదేశం కనబడింది. దగ్గిరలోనే ఏరు ఉన్నది, దాని నానుకుని కొండలున్నాయి. అతను ఎంచుకున్న భూమికి ఉత్తరంగా అరణ్యం ఉన్నది.

మర్నాడు రైతు తాను ఎన్నుకున్న పొలంలో ఉన్న చిన్నచిన్న చెట్లూ, పొదలూ నరకటానికి గొడ్డలీ, కత్తీ తీసుకుని వెళ్ళి పని ప్రారంభించాడు.

"ఎవరా చెట్లు కొట్టేది?" అన్న ప్రశ్న అతనికి వినిపించింది.

అతను ఆశ్చర్యపోయి నిటారుగా నిలబడి చుట్టూ కలయజూశాడు. ఎవరూ కనిపించ లేదు. తాను భ్రమపడ్డాననుకుని మళ్ళీ పొదలను కొట్టసాగాడు.

"ఎవరా కొట్టేది?" అన్న ప్రశ్న మళ్ళీ వినిపించింది. ఈ సారి అతని కా ధ్వని దక్షిణాన ఉన్న చెట్లనుంచి వచ్చినట్టు తోచింది.

"ఈ పక్కన ఉన్న లోయలో ఉండే రైతును. వ్యవసాయం చేయటానికి భూమి బాగుచేసుకుందామనుకుంటున్నాను," అని అతను ఆ కనపడని గొంతులకు సమాధానం చెప్పాడు.

"సరే, మేం కూడా సాయం చేస్తాం!" అన్నాయి, ఆ కంఠాలు.

మరుక్షణమే తన భూమిలో ఉన్న చెట్లూ, పొదలూ వేళ్ళతో సహా పైకి లేచి పక్కన పడిపోవటం అతనికి కనబడింది. అంతేగాదు, చూస్తూండగానే అతని పొలం అంతా శుభ్రంగా చదునైపోయింది.

ఎన్నో రోజులు పట్టుతుందనుకున్న పని కొద్ది ఘడియలలో పూర్తి అవటంతో రైతు

వి. నారాయణప్రసాద్

పరమానందభరితుడై, అరణ్యం కేసి తిరిగి, "మీ సహాయానికి చాలా కృతజ్ఞుణ్ణి," అని చెప్పి, ఇంటికి వెళ్ళాడు.

అతని భార్య అతనికి భోజనం పెడుతూ, "పొలంపని చురుకుగా సాగుతున్నదా?" అని అడిగింది.

"చురుగ్గానా? అంత చురుకు పని నా జన్మలో ఎరగను," అన్నాడు రైతు.

"పొలం ఎక్కడ ఏర్పాటు చేశావు?" అని భార్య అడిగితే రైతు ఏమీ సమాధానం చెప్పలేదు.

మర్నాడు అతను పొలానికి వెళ్ళి అక్కడ పడిఉన్న తుక్కు అంతా తగలబెట్టసాగాడు.

"ఎవరా మంటలు పెట్టేది?" అని మళ్లీ గొంతులు ప్రశ్నించాయి.

"నేనే, రైతును! ఎండు కంపంతా కాల్చేస్తున్నాను," అన్నాడు రైతు.

"సరే, మేం కూడా సహాయం చేస్తాం," అన్నాయి కంఠాలు. పొలంలో ఉన్న కంపా, కలుపూ కుప్పలు కుప్పలుగా పోగయింది. అన్ని కుప్పలూ ఒక్కసారిగా మండాయి. రైతు ఇంటికి పోతూ కనపడని సహాయ కులకు ధన్యవాదాలు తెలుపుకున్నాడు.

మూడోనాడు రైతు పొలానికి వెళ్లి కొట్టిన చెట్లను కట్టెలు కొట్టి, పొలం అంచున పేర్చ నారంభించాడు.





"ఎవరా కట్టెలు కొట్టేది?" అని కంఠాలు అడిగాయి.

"నేనే, రైతును. కొట్టేసిన చెట్లను వంటచెరుకు చేసుకుంటున్నాను," అన్నాడు రైతు. మరుక్షణం చెట్లన్నీ కట్టెపేళ్ళ కట్టలుగా తయారై ఒక పక్కగా పేరాయి.

రైతు పలుగుతో వేళ్ళు తవ్వ నారంభించే సరికి, పందమంది తవ్వుతున్నట్టుగా, పొలం అంతటా నేలలో ఉన్న వేళ్ళన్నీ పైకి వచ్చేశాయి.

రోజూ ఇలాగే జరిగింది. అతను ఒక చాలు దున్నేసరికి పొలమంతా చాళ్ళు దున్ని ఉన్నది. అతను సగం పొలంలో కందా, సగం పొలంలో మొక్కజొన్న వేద్దా మనుకున్నాడు. కాని అతనికి ఏమీ శ్రమ లేకుండా ఆ పనంతా ఎవరో చేసిపెట్టారు.

అదిమొదలు రైతు రోజూ పొలానికి వెళ్లి పైకి వచ్చే జొన్నమొక్కలనూ, కందపిలక లనూ చూసుకుని ఎంతో ఆనందించేవాడు. అతను అనుకున్నట్టే ఆ నేల ఈ రెండు రకాల పంటలకూ చాలామంచిది. మొక్కలు ఏపుగా పెరిగి, పొలమంతా పచ్చగా, నయ నానందంగా ఉన్నది. ఆ పొలంలో ఒక్క కలుపు మొక్క లేదు. కలుపు పనికూడా ఎవరో చేస్తున్నారు.

తన భర్త పొలం పని ఏమీ చేస్తున్నట్టే కనబడలేదు రైతు భార్యకు. అడవి బాగు చేసి వ్యవసాయం చేసేవాడికి చచ్చి చెడి నంత పని. విత్తులు నాటినాక కలుపు తీసే పని ఉంటుంది. ఏ నాడూ తన భర్త అలిసిపోయి ఇంటికి రాగా ఆ ఇల్లాలు చూడలేదు.

"ఎక్కడ నువు చేస్తున్న పొలం? ఎన్ని సార్లడిగినా చెప్పవేం?" అని ఆమె భర్తను అడిగింది.

"ఎక్కడో ఉందిలే! ఎక్కడైతేనేం?" అని రైతు మాట తప్పించాడు. అతని అసలు భయమేమంటే, ఏ దేవతలో దయ

తలిచి తనకు అంతులేని సహాయం చేస్తు న్నారు. తన భార్యను పొలానికి రానిస్తే ఆ దేవతలకు ఆగ్రహం వచ్చే పని ఏం చేస్తుందోనని.

ఒకనాడు అతను పొలానికి వెళ్ళాడు. మొక్కజొన్నకండె లింకా పాలపొట్టలు. అవి ముదరటానికీ, కందదుంపలు ఊరటా నికీ కనీసం మూడు నాలుగు వారాలయినా పడుతుంది. అప్పటికి గాని తన యత్నం ఫలించదు.

ఇలా అనుకుని ఆనందాతిశయంతో గొంతెత్తి పాడుకుంటూ కాలిబాటన ఇంటిదారి పట్టాడు రైతు. ఇంటి సమీపంలో అతనికి భార్య ఎదురొచ్చి, "పాట బాగానే ఉందిలే. ఇంట్లో పొయిలోకి కట్టెలు లేవు. సాయంకా లానికి పొయిలో పిల్లి లేచే మార్గం చూడు. ఆ తరవాత తీరిగ్గా కూచుని పాడుకుందూ గాని," అన్నది.

"పొదల్లోకి వెళ్ళి ఎండుపుల్లలు ఏరుకు రాలేవా? అది కూడా నేనే చెయ్యాలా ?" అన్నాడు రైతు చిరాకుగా.

"భూమి బాగుచేసినప్పుడు బోలెడంత వంటచెరుకు వచ్చి ఉండాలే? ఎండుపుల్లలు ఏరుకొచ్చే కర్మేం? ఇంతకీ నీ పొలం ఎక్క డున్నదీ చెబుతావా, నన్ను పుట్టింటికి వెళ్ళి పొమ్మంటావా?" అన్నది రైతు భార్య.



"ఎందుకు చెప్పనూ? రహస్యమా?" అంటూ రైతు తన భార్యకు దారిగుర్తులు చెప్పి, "కట్టెలు తీసుకుని త్వరగా మాత్రం రా. రాత్రికి తిండి లేకుండా మాడ్చకు," అన్నాడు. భార్య బయలుదేరుతుంటే అత నామెను వెనక్కు పిల్చి, "చూడూ, నిన్నెవరన్నా ప్రశ్నలు వేస్తే సమాధానం మటుకు చెప్పకు. విననట్టు ఊరుకో!" అని హెచ్చరించాడు.

ఆమె పొలాన్ని చేరుకుని, ఏపుగా పెరిగిన పంట చూసి చాలా ముచ్చట పడింది. ఆమె ఒక జొన్నకండె విరిచి, వేలితో నొక్కి చూస్తూ, "ఇంకా ముదరాలి!" అను కున్నది.

అంతలోనే, "ఎవరా కండెలు విరిచేది?" అన్న ప్రశ్న వినపడింది.

తన భర్త చేసిన హెచ్చరిక మరిచిపోయి ఆమె చుట్టూ చూస్తూ, "నువ్వెవరు అడగ టానికి? ఇది మా పొలం," అన్నది.

అదే సమయంలో ఆమె దృష్టి కంద మొక్కల మీద పడింది. ఆమె ఒక కంద దుంపను కుళ్ళగించి, పైకి తీసింది.

"ఎవరా కందదుంపలు తీసేది?" అని మళ్ళీ ప్రశ్న వినబడింది.

"మా దుంపలు నేను తీసుకోవటానికి నీ అనుమతేమిటి?" అన్నది రైతుభార్య.

"సరే, మేమూ సహాయం చేస్తాం!" అని ఎవరో అదృశ్యవ్యక్తు లనటం వినిపించింది. మరుక్షణం చేలో ఉన్న కండెలన్నీ పెళపెళా విరిగి పోగులు పడ్డాయి. కంద దుంపలన్నీ పైకి వచ్చేశాయి.

రైతు భార్యకు చెప్పరాని భయం పుట్టుకొచ్చింది. ఆమె కట్టెలు తీసుకోవటం కూడా మరిచిపోయి, ఇంటికి పరిగెత్తి పోయింది. భర్త ఏం జరిగిందని అడిగితే ఆమె నోట మాట రాలేదు.

రైతు వెళ్ళి తన పొలాన్ని చూసుకుంటే అంతా సర్వనాశనమై ఉన్నది.






# డబ్బుకు ఉచ్చు

ఒక కుగ్రామంలో ఒక రైతు ఉండేవాడు. అతనూ, అతని భార్యా కొద్ది రోజుల తేడాగా చనిపోయారు. వారికి ముగ్గురు కొడుకులుండేవారు.

"చూడండి, ఈ ఇల్లు నా వంతు," అన్నాడు పెద్దవాడు.

"మెరక పొలం నా వంతు," అన్నాడు రెండోవాడు.

"మరి నా వంతు ఏమిటి?" అని మూడోవాడు అన్నలను అడిగాడు.

ఇల్లంతా గాలిస్తే అటక మీద పెద్ద తాడు చుట్ట కనిపించింది.

"దీన్ని నువ్వు తీసుకుపోయి దీని సహయంతో బతుకు," అన్నారు అన్నలు.

చిన్న తమ్ముడు ఉత్సాహం గలవాడు.

"ఓ, అలాగే బతుకుతాను," అని వాడు తాటి చుట్టను భుజానికి తగిలించుకుని బయలుదేరాడు.

వాడు ఊరుదాటి అడవి కుండా పోతుంటే అడవి మృగాలు కనిపించాయి. వాడు తన వద్ద ఉన్న తాడుకు ఉచ్చులు అల్లి, వాటితో ఒక ఉడతనూ, ఒక కుందేలునూ పట్టుకున్నాడు. కర్ర పుల్లలతో ఒక బోను తయారు చేసి, అందులో ఉడతనూ, కుందేలునూ ఉంచి, ఒక సరస్సు వద్దకు చేరుకున్నాడు. అక్కడ వాడికొక ఎలుగు బంటి పొదలలోకి పోతూ కనిపించింది.

అక్కడ వాడొక చెట్టు కింద చేరి, ఇంకా జంతువులను పట్టుకునే ఉద్దేశంతో, తన వద్ద ఉన్న తాడులో చిన్న, పెద్ద ఉచ్చులు వెయ్యటం మొదలు పెట్టాడు.

ఆ సరస్సులో ఒక జలరాక్షసు డుంటున్నాడు. వాడు నీటిలో నుంచి తల పైకి పెట్టి, ఒడ్డున ఉన్న కుర్రవాణ్ణి చూశాడు. కాని వాడు ఏం చేస్తున్నదీ ఆ రాక్షసుడికి అర్థం కాలేదు.

ఆర్. శకుంతల

జలరాక్షసుడు అడుగుకు వెళ్ళిపోయి, తన కొడుకును పిలిచి, "సరస్సు ఒడ్డున ఎవడో కుర్రాడు కూర్చుని ఏమిటో చేస్తున్నాడు. ఏం చేస్తున్నాడో, వెళ్ళి కనుక్కురా," అన్నాడు.

జలరాక్షసుడి కొడుకు సరస్సులో నుంచి పైకి వచ్చి, చిన్న తమ్ముడి కెదురుగా నిలబడి, "ఇక్కడ చేరి ఏమిటి నువు చేస్తున్నది?" అని అడిగాడు.

చిన్న తమ్ముడు తల ఎత్తి చూసి, తనకు ఎదురుగా ఉన్నవాడు జలరాక్షసుడని గ్రహించాడు. కుర్రవాడు చూడ ముచ్చటగానే ఉన్నాడు గాని, వాడి జుట్టు నాచులాగా ఉన్నది. తాను జలరాక్షసులను గురించి అదివరకు విని ఉన్నాడు. వాళ్ళకు మెదడు చాలా తక్కువ, కాని వాళ్ళకు లొంగిపోయినవాడికి విముక్తి ఉండదు.

చిన్న తమ్ముడు జలరాక్షసుడి కొడుకుతో నిర్భయంగా, "కనిపించటం లేదా? ఉచ్చు తయారు చేస్తున్నాను. దీన్ని ఈ సరస్సుకు వేసి, సరస్సును పట్టుకుపోబోతున్నాను. మీ రంతా ఇంకో చోటు చూసుకోవలిసి ఉంటుంది," అన్నాడు.

జలరాక్షసుడి కొడుకు చప్పున సరస్సులోకి దూకి, తండ్రిని చేరుకుని, "ఆ అబ్బాయి




మన సరస్సుకు ఉచ్చువేసి పట్టుకుపోతాట్ట. మనని ఇంకో చోటు చూసుకోమన్నాడు," అని చెప్పాడు.

"పెద్ద చిక్కే వచ్చిందే! నువు మళ్ళీ వెళ్ళి, చెట్టెక్కటంలో పందెం వెయ్యి. వాడు పందెంలో ఓడిపోగానే నీటిలోకి తోసెయ్యి," అన్నాడు జలరాక్షసుడు కొడుకుతో.

ఆ కుర్రవాడు మళ్ళీ చిన్న తమ్ముడి దగ్గిరికి వచ్చి, "నాతో పందెంవేసి చెట్టెక్కుతావా?" అని అడిగాడు.

"పని మీద ఉన్నాను, కనిపించటం లేదా? కావలిస్తే నా బుల్లి తమ్ముడు నీతో



పందెం వేస్తాడు," అంటూ చిన్నతమ్ముడు కర్రపుల్లల బోనులో నుంచి ఉడతను పైకి తీసి వదిలాడు.

జలరాక్షసుడి కొడుకు కళ్ళు మూసి తెరిచే లోపల ఉడత చెట్టు పైకి పారిపోయింది. వాడు వెళ్ళి తండ్రితో తాను ఓడిపోయినట్టు చెప్పాడు.

"అయితే అయిందిలే. ఈసారి పరుగు పందెం వెయ్యి. ఈసారైనా వాణ్ణి ఓడించు," అన్నాడు జలరాక్షసుడు తన కొడుకుతో.

"నాతో సమంగా పరిగెత్తుతావా?" అని జలరాక్షసుడి కొడుకు చిన్నతమ్ముణ్ణి అడిగాడు.

"నాకు వేరే పని ఏమీ లేదనుకున్నావా? కావలిస్తే నా చిట్టి తమ్ముణ్ణి ఇస్తాను. వాడితో పరిగెత్తు," అంటూ చిన్నతమ్ముడు కుందేలును బోనులో నుంచి తీసి, వదిలాడు. అది చెంగు చెంగున దూకుతూ క్షణంలో కాన రాకుండా ఎటో వెళ్ళిపోయింది.

జలరాక్షసుడి కొడుకు మళ్ళీ తండ్రి దగ్గరికి వెళ్ళి, తాను ఓడిపోయినట్టు చెప్పాడు.

"వీ డెవడో మన పాలిటికి బాగా దాపరించాడే! చూడు, వీడు బలంలో నిన్ను మించగలడనుకోను. వాణ్ణి మల్లయుద్ధానికి రమ్మని, ఓడించి, ఈసారైనా నీటిలోకి తోసెయ్యి," అన్నాడు జలరాక్షసుడు.

జలరాక్షసుడి కొడుకు చిన్నతమ్ముడి దగ్గిరికి మరోసారి వచ్చి, "చాతనైతే నాతో మల్లయుద్ధం చేసి గెలు!" అన్నాడు.

"నాకు నీతో ఆటలాడే తీరికలేదు. మా ముసలి తాత ఆ కనపడే పొదల్లో నిద్ర పోతున్నాడు. కావాలంటే ఒక పట్టు పట్టి చూడు. నిద్రమత్తున ఉన్నా నువు గెలవటం అనుమానమే," అంటూ చిన్న తమ్ముడు ఎలుగుబంటి ఉన్న పొదలను చూపాడు.

జలరాక్షసుడి కొడుకు ఆ పొదలలోకి వెళ్ళి, ఎలుగుబంటితో కలియబడి, ఒళ్లంతా హూనం అయి ఎలాగో బయటపడ్డాడు.

తన కొడుకు మళ్ళీ ఓడిపోయి వచ్చే సరికి, జలరాక్షసుడు, "వీడితో మంచిగా రాజీ పడటమే మేలు. వాడు సరస్సుకు ఉచ్చు వెయ్యకుండా వెళ్ళిపోవటానికి ఎంత డబ్బు అడుగుతాడో కనుక్కురా!" అన్నాడు కొడుకుతో.

జలరాక్షసుడి కొడుకు ఇంకోసారి తన ఎదట నిలబడటం చూసి చిన్న తమ్ముడు, "ఏం, ఇంకా ఒంటి తీట తీరలేదా?" అని అడిగాడు.

"అబ్బే, అందుకు రాలేదు. మనకు మనకు పందాలు వద్దు. ఈ మాటచెప్పు, నువు మా సరస్సును వదిలిపెట్టి పోవటానికి ఎంత డబ్బు తీసుకుంటావు?" అని జలరాక్షసుడి కొడుకు అడిగాడు.

చిన్నతమ్ముడు కొంచెం ఆలోచించి, తన నెత్తి మీద టోపీ తీసి చూపిస్తూ, "దీని నిండా బంగారు నాణాలు పొయ్యి, నా దారిన నేను పోతాను," అన్నాడు.

ఈ మాట కొడుకు చెప్పగానే జలరాక్షసుడు సంతోషించి, "ఏమో, అనుకున్నాను, తక్కువలోనే వదులుతున్నాడు," అని తన కొడుక్కు ముంతెడు బంగారు నాణాలు ఇచ్చి పంపాడు.

ఈ లోపల చిన్న తమ్ముడు తన టోపీ పై భాగంలో పెద్ద చిరుగుపెట్టి, నేలలో పెద్ద



గుంట తవ్వి, ఆ గుంట మీద టోపీని వెల్లి కిలా పెట్టాడు. జలరాక్షసుడి కొడుకు వచ్చి, వెంటతెచ్చిన ముంతెడు బంగారం పోసినా టోపీ నిండలేదు.

"ఇంకా పట్టుకురా. టోపీ నిండలేదు," అన్నాడు చిన్న తమ్ముడు.

జలరాక్షసుడి కొడుకు ఇంకా బంగారం కావాలని వచ్చాడు.

"అంత బంగారం పోసినా నిండని టోపీ అదేం టోపీరా? ఏం చేస్తాం? మరో ముంతెడు పట్టుకుపో," అన్నాడు తన కొడుకుతో జలరాక్షసుడు.

రెండో ముంతకు కూడా టోపీ నిండ లేదు. మూడోసారి మరో ముంతెడు బంగారం తెచ్చి పోశాక, టోపీ కింది గుంటా, టోపీ కూడా నిండాయి.

"ఇక నేను పోతాను. మీరు నిశ్చింతగా ఉండండి," అని జలరాక్షసుడి కొడుకును పంపేసి, బంగారమంతా తీసుకుని చిన్న తమ్ముడు తమ ఊరికి తిరిగిపోయి, పెద్ద ఇల్లు కొనుక్కుని, నౌకర్లను ఏర్పాటు చేసు కుని, జమీందారల్లే జీవించసాగాడు.

వాడి అన్నలు వాడి వద్దకు వచ్చి, "నీ కీ డబ్బంతా ఎక్కడిదిరా?" అని అడిగారు.

"మీరు నా వంతు కిచ్చిన తాడులో ఉచ్చులు వేసి, జంతువులను పట్టుకుని డబ్బు సంపాదించాను," అన్నాడు చిన్న తమ్ముడు.

"మాకూడా ఆ తాడు అరువిస్తావా? మళ్ళీ దాన్ని నీకు భద్రంగా తెచ్చి ఇస్తాంలే," అన్నారు అన్నలు.

"దానికేం భాగ్యం. తీసుకుపొండి," అని చిన్న తమ్ముడు వాళ్ళకు తాటి చుట్ట ఇచ్చేశాడు.

కాని అది అతనికి మళ్ళీ చేరలేదు. అసలు అతని అన్నలు ఆ తాడు తీసుకుని ఎటు పోయారో, ఏమయారో ఎవరికీ తెలియదు.



# పనికిరాని ప్రఖ్యాతి

కళింగదేశపు రాజు అపర దానకర్ణుడు. నిరతాన్న ప్రదాత. రోజూ వేలాది బీదజనానికి అన్నదానమూ, బ్రాహ్మణులకు సువర్ణదానమూ చేస్తూండేవాడు. మహాదాతగా ఆయన కీర్తి దేశదేశాలా పాకింది.

కళింగరాజు కొక కుమార్తె ఉన్నది. ఆమెకు యుక్తవయసు వచ్చింది. తగిన వరుడి కోసం అన్వేషిస్తూండగా కాంభోజరాజు కొడుకు కళింగరాజ కుమార్తెకు అన్ని విధాలా తగినవాడని తెలిసింది.

కళింగరాజు కాంభోజరాజు వద్దకు దూతలను పంపాడు. వాళ్ళు వెళ్ళి కాంభోజ రాజుతో, "మా మహారాజుగారి ఖ్యాతి అందరికీ తెలిసినదే. ఆయన లక్షలాది పేదసాదలకూ, బ్రాహ్మణులకూ నిత్యమూ దానధర్మాలు చేస్తూఉంటారు. వారి కుమార్తెను తమ కుమారుడికి చేసుకుంటే ఎంతైనా బాగుంటుంది," అన్నారు.

"మీ దేశం నిండా పేదవాళ్ళే ఉన్నట్టు కనబడుతుంది. అలాటి పేదదేశంతో మేము సంబంధం చేసుకోము," అన్నాడు కాంభోజరాజు.





# మాయమైనవాడు

ఒక దేశంలో ఒక జమీందారుకు ఒక కొడుకు పుట్టాడు. ఆ కుర్రవాడింకా పుట్టక పూర్వమే జమీందారుకు ఒక కల వచ్చింది. అందులో ఆయనకు ఒక విషయం తెలియవచ్చింది. అదేమిటంటే, తనకు పుట్టబోయే కొడుక్కు పదేళ్ళు వయసు వచ్చేదాకా అతని శరీరం భూమిని తాక రాదు; తాకితే ప్రమాదం కలుగుతుంది.

జమీందారుకు ఇలాటి వాటిలో నమ్మకం జాస్తి. అందుచేత, తనకు కొడుకు కలగగానే, ఆయన ఆ బిడ్డను పదేళ్ళు నిండేదాకా భూమిమీద కాలు మోపనివ్వరాదని కట్టుదిట్టం చేశాడు. అందుచేత ఆ పిల్లవాడికి పాకే ఈడు దాటి నడిచే ఈడు వచ్చిన తరవాత కూడా ఎవరో ఒకరు ఎత్తుకుని మోసేవారు.

ఇలా ఆ కుర్రవాడు భూమి స్పర్శ లేకుండా పెరుగుతూండగా ఒకనాడు ఒక పెద్ద పొరపాటు జరిగింది. ఆ పిల్లవాణ్ణి ఎత్తుకు తిప్పటానికి కొత్తగా ఏర్పాటైన దాసీది, ముందులోగిట్లో ఏదో కలకలం విని, తన చంకన ఉన్న కుర్రవాణ్ణి నేలమీద కూర్చోబెట్టి, పరిగెత్తి వెళ్ళింది. త్వరలోనే ఆమె తాను చేసిన తప్పు తెలుసుకుని, వెనక్కు వచ్చి చూస్తే కుర్రవాడు లేడు.

ఆ దాసీది వెంటనే జమీందారు దగ్గిరికి పోయి తాను చేసిన తప్పు ఒప్పుకుని, కుర్రాడు కనిపించటం లేదని చెప్పింది. ఇల్లు యావత్తూ వెతికారు, చుట్టూ ఉండే ఆవరణ అంతా వెతికారు. లాభంలేక పోయింది. జమీందారు కొడుకు మాయమయాడు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి.

జమీందారుగారి భవంతిలోని ఒక పెద్ద హాలులో రాత్రివేళ వింత ధ్వనులు వస్తున్నట్టు దివాణం కాపలా వాళ్ళు చెప్పారు.

బి. శ్రీమన్నారాయణ



సరిగా అర్ధరాత్రివేళ ఆ హాలులో ఎవరో నడిచిన చప్పుడూ, మూలిగిన చప్పుడూ అవుతుండటం నిజమని తేలిపోయింది. రాత్రివేళ ఆ హాలు చాయలకు వెళ్ళటానికి దివాణంలో అందరూ భయపడ్డారు.

ఈ చప్పుళ్ళకూ, మాయమైన తన కొడుకుకూ ఏమైనా సంబంధం ఉండ వచ్చునని జమీందారుకు ఆశ పుట్టింది. అందుచేత ఆయన, ఆ హాలులో ఒక రాత్రంతా గడిపి, అక్కడ ఏం జరిగేదీ తెలిపినవారికి నూరు బంగారు కాసులు ఇస్తానని అన్నాడు. మొదట ఎవరూ ముందుకు రాలేదు. తరవాత కొందరు డబ్బుకు ఆశ పడి, రాత్రల్లా హాలులో ఉంటామన్నారు గాని, అర్ధరాత్రి కాకముందే భయంతో మతి చెడి బయటికి వచ్చేశారు.

మాయమైన తన కొడుకును తాను తిరిగి చూసే అదృష్టం తనకు లేదని జమీందారు నిరాశ చేసుకున్నాడు.

జమీందారుగారి కోటకు సమీపంలోనే ఒక పేదరాలుండేది. ఆమెకు ఇద్దరు కుమార్తెలుండేవారు. పేదరాలి పెద్ద కూతురు ఒకనాడు దివాణానికి వచ్చి, తనకు డబ్బు ఇచ్చే పక్షంలో ఒక రాత్రంతా హాలులో ఉంటానన్నది.

"అమ్మాయీ, నీకేదన్నా ప్రమాదం జరగవచ్చు, ముందే ఆలోచించుకో!" అన్నాడు రాజు.

"ఆలోచించే దేమిటిలెండి! పేదవాళ్ళం గదా, మాకు దేని భయమూ ఉండదు," అన్నదా పిల్ల.

"అలా అయితే నువు ఒక రాత్రి ఆ హాలులో గడిపి, ఏం జరిగేదీ ఉదయం చెప్పు. నీకు డబ్బిస్తాను," అన్నాడు జమీందారు.

పేదరాలి పెద్ద కూతురు తనకు ఆ రాత్రికి కావలిసిన వంటపదార్థాలూ, పాత్రసామగ్రీ, వంటచెరుకూ, పడుకునేటందుకు



మంచమూ, పక్కా జమీందారుగారి నడిగి తీసుకుని, హాలులోకి ప్రవేశించింది.

అన్నీ అమర్చుకుని ఆమె వంట ప్రారంభించేసరికే చాలా పొద్దుపోయింది. వంట ఇంకా పూర్తి కాకముందే అర్ధరాత్రి అయింది. అదే సమయంలో ఆమెకు అడుగుల చప్పుడూ, ఎవరో మూలగటమూ వినిపించింది. ఆమె భయంతో అటూ ఇటూ చూసింది. ఎవరో యువకుడు ఆమె కేసి రావటం కనబడింది.

ఆ యువకుడు ఆమెను సమీపించి, "వంట చేస్తున్నట్టున్నావు, ఎవరి కోసం?" అని అడిగాడు.

"ఎవరికోస మేమిటి? నా కోసమే!" అన్నదామె తిరస్కారంగా.

"ఈ కంచమూ, పళ్ళాలూ ఎవరు భోజనం చెయ్యటానికి?" అని ఆ యువకుడు మళ్ళీ అడిగాడు, కొంచెం చిన్నబుచ్చుకున్నట్టు కనడుతూ.

"ఎవరేమిటి? నేను భోజనం చెయ్యటానికే!" అన్నదామె.

"మరి ఈ మంచమూ, ఈ పక్కా ఎవరు పడుకోవటానికి?" అని ఆ యువకుడు మళ్ళీ అడిగాడు.

"నేను పడుకోవటానికే!" అన్నదా పిల్ల.

ఆ యువకుడు దీర్ఘంగా నిట్టూర్చి కనబడకుండా పోయాడు.

తెల్లవారి ఆ పిల్ల జమీందారును చూసి, రాత్రి తాను చూసినదీ, విన్నదీ, అన్నదీ చెప్పి, నూరు బంగారుకాసులు తీసుకుని, ఇంటికి వెళ్ళిపోయింది.

కాని జమిందారుకు తృప్తి కలగలేదు. ఆ యువకుడు తన కొడుకే కావచ్చు, కాని తన కళ్ళ పడలేదు, తనకు దక్కలేదు. రాత్రిపూట ఆ హాలులో కనిపించే ఆ యువకుణ్ణి తనకు ఎవరన్నా చూపగలిగితే ఇంకా పెద్ద బహుమానం ఇవ్వటానికి ఆయన సిద్ధపడ్డాడు.

ఈ సంగతి తెలిసి పేదరాలు ఈ సారి తన చిన్న కూతురును జమీందారు వద్దకు పంపింది. ఆ పిల్లవచ్చి, జమీందారు కోరిక తీర్చటానికి తాను ప్రయత్నిస్తానన్నది. జమీందారు సరే నన్నాడు.

ఆ రాత్రి ఆమె కూడా తన అక్కలాగే హాలులోకి వంటసామగ్రీ, ఆహారపదార్థాలూ, వంటచెరుకూ, మంచమూ, పక్కా తెచ్చుకుని, వంట చేసుకున్నది. వంట పూర్తి కావచ్చింది. భోజనం చేద్దామని కంచమూ, పళ్ళాలూ అమర్చుకున్నది.

ఇంతలో అడుగుల చప్పుడు వినిపించింది. ఆమె తిరిగి చూసేసరికి ఒక యువకుడు ఆమెకు సమీపంగా నిలబడి, "వంట చేస్తున్నావు, ఎవరి కోసం?" అని అడిగాడు.

ఆ యువకుడి కంఠధ్వనిలో మాధుర్యం ఉన్నది గాని, అతని ముఖంలో ఆమెకు దైన్యం కనబడింది.

"నా కోసమనే వంట చేసుకుంటున్నాను. కావాలంటే అది నీకూ పనికి వస్తుంది," అన్నదా పిల్ల.

ఈ మాటకు అతని ముఖం కొంచెం వికసించినట్టు కనబడింది.

"ఆ కంచమూ, పళ్ళాలూ ఎవరి భోజనానికి?" అని అతను అడిగాడు.





"నా భోజనానికే. కావలిస్తే నువు కూడా భోజనం చెయ్యవచ్చు," అన్నదామె.

"ఆ మంచం, పక్కా సంగతేమిటి? ఎవరు పడుకునేటందుకు?" అని అతను మళ్ళీ అడిగాడు.

"నా కోసమే. కాని కావాలంటే నువు పడుకో," అన్న దామె.

ఈ మాటలకు అతని ముఖాన చిరునవ్వు కనబడింది. "చాలా కృతజ్ఞుణ్ణి. నీ ఆహ్వానం సంతోషంతో స్వీకరిస్తాను," అన్నాడతను.

అప్పటికే వంట పూర్తి అయింది. ఆమె అతనికి వడ్డన చెయ్యబోతూ ఉంటే, "ఒక్క క్షణం ఆగు. నాకు ఉపకారం చేసినవాళ్ళకు కృతజ్ఞతలు చెప్పుకుని ఇప్పుడే వస్తాను," అంటూ ఆ యువకుడు హాలు మధ్యకు నడిచాడు.

ఆ పిల్ల చూస్తూండగానే నేలలో గుండ్రని బిలం ఏర్పడి, అందులో నుంచి పూలవాసనతో కూడిన గాలి హాలులోకి వచ్చింది. ఆ బిలంలోకి యువకుడు దిగాడు.

సగం, అతను ఏమైపోతాడో నన్న భయంతోనూ, సగం, జరిగేదంతా చూసి జమీందారుకు చెప్పే బాధ్యత తన పైన ఉన్నదన్న భావంతోనూ ఆమె చప్పున బిలాన్ని సమీపించి, తాను కూడా అందులోకి దిగింది.

దిగువన ఆమె కొక వింత ప్రపంచం కంట బడింది. అక్కడ ఒక అందమైన సెలయేరు ప్రవహిస్తున్నది. అందులో ప్రవహించే నీరు కరిగిన బంగారంలాగున్నది. పచ్చనిగడ్డితివాసీ లాటి మైదానంలో అక్కడక్కడా బంగారు శిఖరాలతో కూడిన కొండలూ, విరబూసిన పూలమొక్కలూ ఉన్నాయి. యువకుడు ఈ మైదానం మీదుగా వెళ్ళి ఒక వనాన్ని చేరుకున్నాడు. ఆ వనంలో బంగారు చెట్లున్నాయి. ఆ చెట్లమీద ఉండే వందలాది పక్షులు యువ

కుణ్ణి చూడగానే అతని చుట్టూ మూగాయి; కొన్ని అతని తల మీదా, భుజాల మీదా, చేతుల మీదా వాలి, అతన్ని బాగా ఎరిగి నట్టు కనిపించాయి. అతను అన్నిటినీ పరామర్శించి ముందుకు సాగాడు. ఆ పిల్ల కూడా అతని వెనకనే పోయింది.

మరొక చిన్న మైదానం దాటి వాళ్ళు వెండిచెట్లున్న వనం చేరారు. అక్కడ రకరకాల జంతువులు యువకుడి చుట్టూ మూగాయి. అతను ఆప్యాయంగా వాటి నన్నిటినీ నిమిరాడు. ఈ విధంగా అతను తన మిత్రుల కందరికీ వీడ్కోలు తెలిపి, వెనక్కు తిరిగాడు. అతనితో బాటు ఆమె కూడా ఇంటికి తిరిగి వచ్చింది. వాళ్ళిద్దరూ బిలం ద్వారా హాలులోకి రాగానే బిలం మూసుకుపోయి, అది ఎక్కడ ఉండినదీ తెలియరాలేదు.

"ఇక నాకు భోజనం పెడతావా?" అన్నాడు యువకుడు ఆమెతో.

ఇద్దరూ కలిసి భోజనం చేశారు. తనకు నిద్ర ముంచుకొస్తున్నదని చెప్పి యువకుడు వెళ్లి మంచంమీద పడుకున్నాడు. ఆమె ఎంగిళ్ళు శుభ్రంచేసి వెళ్ళి చూసేసరికి అతను గాఢనిద్రలో మునిగి ఉన్నాడు. ఆమె కింద పడుకుని నిద్రపోయింది.

మర్నాడు సూర్యోదయమైనాక కూడా వాళ్ళు నిద్ర లేవలేదు. జమీందారు ఏమి జరిగిందోనని భయపడుతూ తానే స్వయంగా బయలుదేరి వచ్చి, మంచంమీద నిద్ర పోతున్న యువకుణ్ణి చూసి పరమానందం చెందాడు. బాగా పెరిగిపోయినప్ప టికీ అతను తన కొడుకే నని ఆయన గుర్తుపట్టాడు.

కోటలో పెద్ద ఉత్సవం జరిగింది. జమీం దారు కొడుకు తనను తిరిగి మనుష్య ప్రపంచంలోకి తెచ్చిన పిల్లనే పెళ్ళాడతా నన్నాడు. జమీందారు ఏమీ అభ్యంతరం చెప్పక, వారిద్దరికీ వివాహం చేసేశాడు.



# లంకె బేరం

ఒక ఊళ్ళో ఒక వడ్డీవ్యాపారి ఉండేవాడు. వాడు పరమ కర్కోటకుడు. వడ్డీ విపరీతంగా గుంజి, వాయిదా లోపల బాకీ తీర్చనివారి ఆస్తులు స్వాధీనం చేసుకుని చాలా ధనం సంపాదించాడు.

ఒకరోజు జయకాంతు డనేవాడు వడ్డీవ్యాపారి దగ్గిరికి వచ్చి, యాభైరూపాయలు అప్పు అడిగాడు. నూరు రూపాయలకు నోటు రాసి, రెండునెలల లోపల తీర్చినట్టయితే యాభై రూపాయ లిస్తాననీ, లేకపోతే జయకాంతుడి ఆస్తి వేలం వేస్తాననీ వడ్డీవ్యాపారి అన్నాడు.

"నాకున్న ఆస్తి అంతా కలిసి ఒక చిలుకా, ఒక గుర్రమూనూ. మీ బాకీ రెండు నెల్లలో తీర్చకపోతే వాటినమ్మి మీ బాకీ తీర్చేస్తాను," అన్నాడు జయకాంతుడు.

గడువు అయిపోయింది. జయకాంతుడి గుర్రం ఖరీదు మూడువందలకు తక్కువ ఉండదు. బాకీ కింద గుర్రాన్ని తీసుకుంటానన్నాడు వడ్డీవ్యాపారి.

"గుర్రాన్ని విడిగా అమ్మను. చిలకనూ, గుర్రాన్నీ కలిపి అమ్ముతాను. రెంటికిందా నాలుగువంద లివ్వండి," అన్నాడు జయకాంతుడు.

"నీ వెధవచిలక నా కవసరం లేదు," అన్నాడు వడ్డీవ్యాపారి.

"రెంటినీ అమ్మి, గుర్రంధర మీ కిచ్చేస్తాను," అని జయకాంతుడు వడ్డీవ్యాపారిని సంతకు తీసుకుపోయి, "చిలుకా, గుర్రమూ నాలుగువందలు!" అని అరిచాడు.

ఒక పెద్దమనిషి వచ్చి, "చిలుక ఖరీదూ, గుర్రం ఖరీదూ విడివిడిగా ఎంత?" అని అడిగాడు. వాడు జయకాంతుడి మనిషే.

"గుర్రం వెల నాలుగురూపాయలు. చిలుక వెల నాలుగువందలు," అన్నాడు జయకాంతుడు. ఆ మనిషి గుర్రం తీసుకుని నాలుగురూపాయలు జయకాంతుడి చేతిలో పెట్టాడు. వాడు ఆ నాలుగురూపాయలూ వడ్డీవ్యాపారి కిచ్చి, "బాకీ తీరింది," అని తన దారిన వెళ్ళిపోయాడు.





# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

కొంత కాలం సుఖాలలో మునిగి తేలాక సింద్‌బాద్‌కు విలాస జీవితం మొహం మొత్తింది. అతనికి కొత్త దేశాలు చూడాలనీ, కొత్త విషయాలు తెలుసుకోవాలనీ కోరిక కలిగింది. దేశాటన లాభసాటిగా ఉండాలంటే వర్తకం చేయాలి. అందుచేత అతను బజారులో వర్తకానికి యోగ్యమైన సరుకులు కొని, మూటలు కట్టించుకుని, వాటితో సహా ఓడలరేవు చేరాడు.

త్వరలోనే రేవులోకి ఒక మేలైన ఓడ వచ్చింది. అది సముద్రయానాలకు దివ్యంగా పనికివచ్చే ఓడ. దానికి అందమైన, పెద్ద పెద్ద తెరచాపలున్నాయి. దాన్ని చూడగానే సింద్‌బాద్‌కు ఆ నౌకలో ప్రయాణం చెయ్యాలనిపించింది. అతనికి తెలిసిన మరికొందరు వర్తకులు కూడా అందులోనే ప్రయాణం చేస్తున్నారు. సింద్‌బాద్ తన సరుకును కూడా అందులోనే ఎక్కించి, మిత్రులతో ప్రయాణం సుఖంగా సాగుతుంది గదా అనుకున్నాడు.

ఆ ఓడ సముద్రంమీద చాలా చురుకుగా ప్రయాణం సాగించింది. అనేక దీవులలో ఓడ నిలిచింది. వర్తకులు అక్కడి అధికార్లతో పరిచయం చేసుకుని, అక్కడి వర్తకులకు తమ సరుకులు అమ్మి, వారి సరుకులు కొన్నారు. ఇలా అనేక వారాలపాటు ప్రయాణం విజయవంతంగా సాగి, అనేక తీరాలలో వ్యాపారం జరిగి, చివరకు ఓడ ఒక దీవిని చేరింది.

అది నిర్జనమైన దీవి లాగా కనబడింది. ఎక్కడా మనుష్య సంచారం లేదు. దీవి మీద ఎత్తయిన చెట్లున్నాయి. వాటి మీద రకరకాల పక్షులు మనోహరంగా కూస్తున్నాయి. దీవి మీద సెలయేళ్ళు గలగలా ప్రవహిస్తున్నాయి. ఆ ప్రదేశం భూలోక స్వర్గంలాగున్నది.

రెండవ యాత్ర



వర్తకులు ఓడదిగి దీవిపైన, చెట్లమధ్యగా షికార్లు చేశారు. సింద్‌బాద్ కొంత ఆహారం తీసుకుని, ఒక సెలయేటి ఒడ్డున చెట్లనీడన కూర్చుని, తిండి తిని, పచ్చని గడ్డి మీద పవళించి నిద్రావస్థలో పడిపోయాడు.

అతనికి తిరిగి మెలకువ వచ్చేసరికి దీవి మీద ఎవరూ లేరు. రేవులో ఓడ కను పించలేదు. అతను రేవులోకి పరిగెత్తి వెళ్లి చూస్తే చాలా దూరంగా తెరచాపలు కనిపించాయి. సింద్‌బాద్ సంగతి గమ నించక, మిగిలినవారితో ఓడ బయలుదేరి పోయింది. సింద్‌బాద్ చూస్తూండగానే ఓడ కనుచూపుమేర దాటిపోయింది.

సింద్‌బాద్ కుంగిపోయాడు. అతని నిస్పృహ వర్ణనాతీతం. అతని సరుకంతా ఓడతో వెళ్లిపోయింది. అతను కట్టుబట్టలతో ఒక నిర్జనమైన దీవిమీద దిగబడిపోయాడు. తన గతి తలుచుకుంటే అతనికి మతి పోయినంత పని జరిగింది. మొదటి ప్రయా ణంలో అతనికి విధి తోడయింది. ప్రతిసారీ విధి సహకరిస్తుందని ఎలా చెప్పటం? చేతి నుంచి జారిపడిన కూజా మొదటిసారి పగలకపోతే, రెండోసారైనా తప్పక పగిలి తీరుతుంది!

అతను పెద్ద పెట్టున ఏడ్చాడు. తల బాదుకున్నాడు. దేవభోగాలు అనుభవిస్తూ బాగ్దాదులో సుఖంగా జీవించేవాడికి ప్రపంచం చూడాలనీ, ఇంకా డబ్బు సంపాదించాలనీ ఎందుకు దుర్బుద్ధి కలగాలి? మొదటి ప్రయాణం సుఖంగా జరిగి ఉంటే పోనీ అనుకోవచ్చు. కాని అప్పుడూ అష్టకష్టాలు పడ్డాడు తాను! కాని ఇప్పుడు ఏమనుకుని ఏంలాభం? ఎవడికి ఏ విధంగా చావు వచ్చేదీ ఎవరు చెప్పగలరు?

ఈ విధంగా కొంతసేపు తనను తాను తిట్టుకుని ఏడ్చాక సింద్‌బాద్ తన దిగ్భ్రమ నుంచీ, నైరాశ్యం నుంచీ క్రమంగా కోలు కుని, కర్తవ్యం గురించిన ఆలోచనలో



పడ్డాడు. జరిగిందేదో జరిగింది. ఇప్పుడు తానున్న ప్రదేశం ఎలాటిదో తెలుసుకోవాలి. అందుచేత అతను చెట్లమధ్యగా నడుస్తూ దీవి లోపలికి బయలుదేరాడు. కొంతదూరం పోయాక అతనికి ఏ క్రూరమృగాలైనా ఎదురవస్తాయేమో నని భయం కలిగింది. వెంటనే అతను ఎత్తయిన చెట్టు ఒకటి ఎక్కి, దాని పైభాగం నుంచి చుట్టూ కలయజూశాడు.

చుట్టూ అతనికి చెట్లూ, పక్షులూ, కొండలూ, గుట్టలూ తప్ప ఇంకేమీ కనిపించలేదు. కాని ఒక దిక్కుగా ఏదో తెల్లని కట్టడంలాటిది కనబడింది. అతనికి దాన్ని చేరాలన్న ఆత్రం కలిగింది.

అతను వెంటనే చెట్టు దిగి ఆ దిక్కుగా నడవసాగాడు. ఏం ప్రమాదం ఎదురవుతుందో నని అతను చిన్న చిన్న అడుగులు వేస్తూ ఆ తెల్లని కట్టడంలాటి దాన్ని చేరుకున్నాడు. అది ఎత్తయిన బురుజు లాగా ఉన్నది. లోపలికి దారి ఉందేమోనని దాని చుట్టూ ప్రదక్షిణం చేశాడు. కాని ఎక్కడా ద్వారమన్నది లేదు. దానిమీదికి ఎక్కి చూద్దామంటే, అది పాలగచ్చులాగా ఉండటంచేత అతని కాలికి పట్టు చిక్కలేదు. దాని ప్రమాణం ఎంత ఉందో చూడటానికి అంగలు లెక్కస్తూ దానిచుట్టూ మళ్ళీ తిరిగాడు. దాని చుట్టుకొలత నూటయాభై అంగలున్నది!

ఎలాగైనా ఆ బురుజులోకి పోయే మార్గం తెలిస్తే బాగుండునని సింద్‌బాద్ అనుకుంటూండగా అకస్మాత్తుగా సూర్యుడు అస్తమించి చీకటి వచ్చేస్తున్నట్టయింది. సూర్యుడికి కారుమేఘం ఏదైనా అడ్డు వచ్చిందనుకోవటానికైనా వేసవి కాలం! కారుమేఘాలుండవు! అతను తల ఎత్తి సూర్యుడి దిక్కుగా చూసేసరికి ఒక బ్రహ్మాండమైన పక్షి కనిపించింది. దాని రెక్కలు పెద్ద పెద్ద మేఘాల ప్రమాణంలో ఉన్నాయి.



61



మీదనే వాలి, తన రెక్కలను దాని చుట్టూ పొడిగి, నిద్రకు ఉపక్రమించింది.

పక్షి నేలమీదకు వాలే సమయానికి సింద్‌బాద్ ఇసుకలో బోర్లా పడుకున్నాడు. దాని కాలు ఒక చెట్టుమానులాగా ఉన్నది. అతను లేచి, తన తలపాగా తీసి, జము లుగా మెలిపెట్టి, మోకు తయారుచేసి, దానితో తనను తాను ఆ పక్షి కాలికి దృఢంగా కట్టుకున్నాడు. ఎప్పటికైనా ఈ పక్షి లేచి పోతుంది. దానితో కూడా తాను ఈ నిర్మానుష్యమైన దీవి నుంచి వెళ్ళిపో వచ్చుననీ, అది మనుషులుండే చోట వాలితే తాను తిరిగి మనుషుల మధ్య పడవచ్చుననీ అతని ఆశ.

సింద్‌బాద్ తనను తాను కాలికి బంధించు కుంటూంటే ఆ పక్షికి ఈగ వాలినట్టయినా ఉన్నట్టు కనబడ లేదు. ఆ పక్షి ఏ రాత్రి వేళ ఎగిరి పోతుందోనని సింద్‌బాద్ తెల్ల వార్లూ మేలుకునే ఉన్నాడు. కాని బాగా తెల్లవారినాకనే, ఆ పక్షి ఒక భయంకరమైన అరుపు అరిచి, గాలిలోకి లేచింది. అది ఎంతో ఎత్తున అతివేగంగా ఎగురుతూ వెళ్ళి ఒక రాతి మీద వాలింది.

అది మళ్ళీ లేచే లోపల సింద్‌బాద్ తన కట్టు విప్పుకుని ఇవతలికి వచ్చేశాడు. మరు

సింద్‌బాద్ మొదట తాను భ్రమపడు తున్నాననుకున్నాడు, కాని అతను ఒకప్పుడు గండభేరుండపక్షులను గురించి విన్నది గుర్తుకొచ్చింది. అవి ఏనుగులను సయితం అవలీలగా ఎత్తుకు పోగలవని యాత్రికులు చెప్పేవారు. అవి సముద్ర మధ్యంలో ఏదో దీవిలో ఉన్నాయిట. ఇది గండభేరుండ పక్షే అయి ఉండాలి. తాను చూసిన తెల్లటి బురుజులాటిది, ఇసుకలో కొంత భాగం కూరుకుపోయిన గండభేరుండపక్షి గుడ్డు కావచ్చునని సింద్‌బాద్ ఊహించాడు.

ఆ ఊహ నిజమే అయింది. ఎందు చేతనంటే ఆ పక్షి తిన్నగా వచ్చి ఆ గుడ్డు

క్షణమే ఆ పక్షి గాలిలోకి లేచినప్పుడు దాని కాళ్ళసందున ఒక నల్లని, అమితలావైన పాము ఉండటం సింద్‌బాద్ గమనించాడు. దాన్ని చూసే అతను రాయి అనుకున్నాడు!

సింద్‌బాద్ చుట్టూ చూసి భయంతో కొయ్యబారి పోయాడు. అతను దిగినది ఒక లోయ. దాని చుట్టూ ఎత్తయిన కొండ లున్నాయి. అవి కూడా లోయ వైపు నిటారుగా ఉన్నాయి. వాటి మీదికి ఎక్కటం అసాధ్యం. ఈ లోయ నిర్జలమైనది. ఇక్కడ గడ్డిపరక కూడా మొలవదు. ఇక్కడ ఆకలి దప్పులతో చావటం నిశ్చయం. సింద్‌బాద్ ఒక ప్రమాద ప్రదేశం నుంచి కష్టపడి తప్పించుకుని అంతకన్న కూడా హెచ్చు ప్రమాదం గల చోట పడ్డాడు!

సింద్‌బాద్ ఆ లోయలో నడవ నారంభించాడు. అక్కడి రాళ్ళలో మణు లుండటం చూసి అతనికి ఆశ్చర్యం కలిగింది. కొన్ని చోట్ల మణులు రాళ్ళ నుంచి ఊడి కుప్పలుగా కూడా పడి ఉన్నాయి. కాని వాటిని చూసి ఆనందించే అవకాశం కూడా లేకుండా, రాళ్ళగుట్టల మధ్యగా పాకుతూ తాటిబొంద ప్రమాణం గల పాములు అతని కళ్ళ పడ్డాయి. అవి రాత్రి పూట యథేచ్ఛగా లోయ అంతటా సంచరించి, పగటివేళ గండభేరుండపక్షుల కళ్ళ





పడకుండా దాక్కోవటానికి తమ రహస్య స్థలాలకు పోతున్నాయి. సింద్‌బాద్ తన ఆకలిదప్పులు కూడా మరిచి, ఈ పాములకు సాధ్యమైనంత దూరంగా మసులుకోవటంలోనే పగలంతా గడిపాడు.

చీకటి పడే సమయానికి అతనికి ఒక కొండ బిలం కనిపించింది. అది అతను దూర దగినంతే ఉన్నది. అతను ఆ బిలంలో దూరి, దానికి రాయి ఒకటి అడ్డం పెట్టాడు. ఇంతలో అతని కొక భయంకరమైన విషయం తెలియ వచ్చింది. అతను దూరిన బిలం ఒక పాముచుట్ట. ఈ సంగతి తెలియగానే అతను మూర్ఛపోయాడు.

తిరిగి స్పృహ తెలిసి, అతను ఆ పాము చుట్ట నుంచి బయటికి వచ్చేసరికి రాత్రి గడిచేపోయింది.

ఆకలి దప్పులతోనూ, భయాందోళనలతోనూ సింద్‌బాద్ చాలా చాలా నీరసించి ఉన్నాడు. అతను బలహీనమైన కాళ్ళమీద నిలబడి, తనను ఆ పాము మింగనందుకు సంతోషిస్తూ ఉండగా ధపామని ఒక పెద్ద మాంసఖండం అతని సమీపంలోనే పడింది. తల ఎత్తి చూస్తే ఎవరూ కనిపించ లేదు. కాని ఎప్పుడో విన్న ఒక మాట అతనికి జ్ఞాపకం వచ్చింది:

రత్నాల లోయ నుంచి రత్నాలు సంగ్రహించేవాళ్ళు, గొర్రెల మాంసం ముక్కలను లోయలోకి విసురుతారు. ఒక్కోసారి రత్నాలు ఆ మాంసంలో ఇరుక్కుంటాయి. తరవాత గండభేరుండపక్షులు ఆ మాంసం ముక్కలను తన్నుకుపోయి, కొండల మీద ఉండే తమ నివాసాలకు చేర్చుతాయి. రత్నాలు సంగ్రహించేవారు పెద్ద అట్టహాసం చేసి, ఆ పక్షులను వాటి నివాసాల నుంచి తరిమేసి, ఆ మణులను తెచ్చుకుంటారు.

వెంటనే సింద్‌బాద్ రత్నాల లోయ నుంచి తప్పించుకునే ప్రయత్నం ప్రారంభించాడు. అతను పెద్ద పెద్ద రత్నాలను

ఏరి తన వంటి మీద చోటున్న చోటనల్లా దాచుకున్నాడు. తరవాత, తన పక్కన పడిన మాంసం ముక్కను తలపాగాతో తన పొట్టకు కట్టుకుని, వెల్లికిలా పడుకున్నాడు. కొంతసేపట్లో ఏదో పక్షి వచ్చి, మాంసం ముక్కతో సహా అతన్ని తన కాళ్ళలో ఇరికించుకుని, ఎగిరిపోయి తన నివాసం వద్ద దించింది. వెంటనే అది మాంసాన్నీ, సింద్‌బాద్‌నూ కూడా ముక్కుతో చీల్చి, తన పిల్లలకు మేపసాగింది.

అదృష్టవశాన ఇంతలో భయంకరమైన చప్పుళ్ళు వినపడ్డాయి. పక్షి ఎగిరిపోయింది. సింద్‌బాద్ ఒళ్లంతా రక్తం ఓడుతూ, లేచి నిలబడ్డాడు. ఆ సమయంలో ఒక వర్తకుడు పరిగెత్తుకుంటూ వచ్చి, సింద్‌బాద్‌ను చూసి నిర్ఘాంతపోయాడు; తరవాత మాంసం ముక్కను పరీక్షించాడు. అందులో రత్నాలు లేవు. అతను సింద్‌బాద్‌తో, "మోసం! దగా! ఎవరు నువు? నా సొత్తు దొంగిలించ వచ్చావా?" అన్నాడు కోపంగా.

సింద్‌బాద్ శాంతంగా, మోసం ఏమీ జరగలేదనీ, తాను రత్నాల లోయలో ఏరిన రత్నాలు కొన్ని అతనికి ఇస్తాననీ అన్నాడు. సింద్‌బాద్ ఇచ్చిన రత్నాలు చూసి ఆ మనిషి మెత్తబడ్డాడు. అతను సింద్‌బాద్‌ను తెగ పొగడి, "ఇలాటి మణి ఒకటి ఉంటే



చాలు! ఎంత గొప్ప రత్నవర్తకుడి వద్దా ఇంత పెద్ద రత్నాలు చూడలేదు. రాజుల వద్ద కూడా ఇలాటివి ఉండవు," అన్నాడు.

ఇంతలో మరికొందరు వర్తకులు కూడా చేరారు. సింద్‌బాద్ తన కథనంతా వారికి చెప్పాడు. ఒక మానవమాత్రుడు రత్నాల లోయలోకి అడుగు పెట్టటమూ, తిరిగి ప్రాణాలతో బయటికి రావటమూ వారికి అమిత ఆశ్చర్యం కలిగించింది. వాళ్ళు సింద్‌బాద్‌ను అభినందించారు.

సింద్‌బాద్ వారి వెంట వారి గుడారానికి వెళ్ళి, తన ఆకలి దప్పులు తీర్చుకుని ఆ పూటా, రాత్రీ ఏకనిద్ర పోయాడు. మర్నాడు ఉదయం అందరూ కలిసి బయలుదేరి సముద్రతీరాన్ని చేరుకున్నారు.

అక్కడి నుంచి వారు ఓడలో బయలుదేరి కర్పూరద్వీపానికి వెళ్ళారు. అక్కడ కర్పూరం చెట్ల కింద ఎంత వేసవిలోనైనా చల్లగా ఉంటుంది. ఈ చెట్లమానులకు గాట్లుపెట్టి, కుండలలో వాటి సొనసుపట్టి, దాని నుంచి హారతికర్పూరం తయారు చేస్తారు.

ఈ ద్వీపంలోనే సింద్‌బాద్ ఒక రాక్షసి ఖడ్గమృగాన్ని చూశాడు. అవి శాకాహారే గాని చాలా భయంకరమైనది. అది తన ముట్టె పైన ఉండే కొమ్ముతో ఏనుగును అవలీలగా గుచ్చి పైకెత్తెయ్యగలదు.

సింద్‌బాద్ ఈ కర్పూర ద్వీపంలో కొద్ది రోజులు సుఖంగా గడిపి, తాను తెచ్చిన మణులలో కొన్ని అమ్మి, వెండి, బంగారాలు కొన్నాడు. అక్కడినుంచి బయలుదేరి, ఎన్నో దీవులూ, దేశాలూ, నగరాలూ చూసుకుంటూ చివరకు, తన స్వస్థలమైన బాగ్దాదు చేరుకున్నాడు. మళ్ళీ అతనికి జీవితం రాజోచితంగా వెళ్ళసాగింది. ఎక్కడెక్కడి వాళ్ళూ వచ్చి, అతని అనుభవాలు చెప్పించుకుని ఆశ్చర్యపోయేవారు.

సింద్‌బాద్ రెండవ అద్భుతయాత్ర అలా ముగిసింది.





# మహాభారతం

పాండవులు తమ తల్లితో సహా వారణావతానికి పోవటానికి సిద్ధమయారు. వారి కోసం గుర్రాలు పూన్చిన రథాలు సిద్ధంగా ఉన్నాయి. వాళ్ళు భీష్ముడికీ, ధృతరాష్ట్రుడికీ, విదురుడికీ, ద్రోణకృపులకూ, బాహ్లిక సోమదత్తుల వంటి ఇతర పెద్దలకూ నమస్కారాలు చేసి, వారి ఆశీర్వాదాలు పొంది, దీనవదనాలతో బయలుదేరారు.

అప్పుడు కొందరు సాహసికులైన బ్రాహ్మణులు పాండవుల వెంబడి పోతూ, రాజభయం ఏ మాత్రమూ లేక, "అయ్యో, ఈ గుడ్డిరాజు ఎంత పాపాత్ముడు! పాండవులు పాపం, ఎవరికేమి అపకారం చేశారు? వాళ్ల తండ్రి పాలించిన రాజ్యం వాళ్ళది కాదా? ఇలా వెళ్ళిపోవటానికి ధర్మరాజు మాత్రం ఎలా ఒప్పుకున్నాడు? ఈ పాపిష్టి రాజ్యంలో మనం ఎందుకుండాలి? ధర్మరాజు ఎక్కడికి పోతే మనమూ అక్కడికే పోదాం," అని గట్టిగా మాట్లాడుకున్నారు.

ఈ మాటలు విని ధర్మరాజు వాళ్ళతో, "అయ్యా, ధృతరాష్ట్రుడు మాకు పెద్ద దిక్కు. ఆయన ఎక్కడికి పొమ్మంటే మేము అక్కడికి పోతాము. మీరు మా మేలు కోరేవారు గనక మాకు ఎదురుగా వచ్చి దీవించి, మీ మీ ఇళ్ళకు తిరిగి వెళ్లండి," అని చెప్పి, వారిని పంపేశాడు.

సాగనంపటానికి వచ్చినవాళ్ళు కూడా వెనక్కు తగ్గినాక, విదురుడు ధర్మరాజు వెంట కొంతదూరం వెళ్ళి, వారి కోసం లక్క ఇల్లు నిర్మాణమై సిద్ధంగా ఉన్నదనీ

**10. లక్క ఇంటి దహనం**



శత్రువుల మనిషి ఒకడు ఆ యింట వారి వెంట ఉంటాడనీ, వారిని ఆ లక్క ఇంటితో పాటు కాల్చేసే ప్రయత్నం జరుగుతుందనీ ఏమరుపాటు ఏ మాత్రమూ లేక వారు ఆ ఇంటి నుంచి బయటపడి ప్రాణాలు దక్కించుకోవాలనీ, తన మనిషి ఒకడు లక్క ఇంటి నుంచి అరణ్యంలోకి సొరంగం తవ్వి ఉంచుతాడనీ, పాండవులు ప్రాణాలు దక్కించుకుని అరణ్యం చేరుకున్నాక నక్షత్రాలను బట్టి దిక్కు తెలుసుకుంటూ ఎటైనా వెళ్ళిపోవాలనీ, లక్క ఇంట ప్రవేశించటం మాత్రం మానవద్దనీ రహస్యంగా చెప్పి, తాను కూడా వెనక్కు మళ్ళాడు.

తరవాత కుంతీదేవి ధర్మరాజుతో, "నాయనా, విదురుడు నీతో ఏదో రహస్యంగా చెప్పాడు, దాన్ని మేము కూడా వినవచ్చునా?" అన్నది. ధర్మరాజు తల్లికీ, తమ్ములకూ, "అగ్ని వగైరా భయాలు కలిగితే నేర్పుగా తప్పించుకోమనీ, నేరుగా జీవిస్తూ, రాజ్యం సాధించుకోమనీ విదురుడు హెచ్చరించాడు. నేను సరేనన్నాను" అని చెప్పాడు.

ఫాల్గుణ శుద్ధ అష్టమీ రోహిణీ నక్షత్రం నాడు పాండవులు వారణావతం చేరారు. వారి రాక ముందుగానే తెలిసి వంది మాగధులూ, బ్రాహ్మణులూ మేళతాళాలతో ఎదురు వచ్చారు. వారికోసం ఊరంతా తోరణాలతోనూ, ముగ్గులతోనూ, పుష్పమాలలతోనూ అలంకరించారు. పాండవులు పురప్రవేశం చేసి, అక్కడి బ్రాహ్మణ; వైశ్య, శూద్ర గృహాలకు వెళ్ళి, అందరికీ బహుమతు లిచ్చారు.

తరవాత పురోచనుడు వారిని వారికోసం ఏర్పాటు చేసిన ఇంటికి తీసుకుపోయి, అక్కడ వారికి భోజనంకూడా తానే ఏర్పాటు చేశాడు. అక్కడ వారు పదిరోజులున్న అనంతరం పురోచనుడు ధర్మరాజుతో, "అయ్యా, మీ కోసం కొత్తగా కట్టించిన



ఈ ఇంట్లో మీరు ప్రవేశించండి," అని ఆ ఇంటి గొప్పతనమంతా వివరించి చెప్పాడు. ఆ ఇంటి రహస్యం అదివరకే తెలుసుకుని ఉన్న ధర్మరాజు పురోచనుడితో ఆ ఇంటి అందచందాలు మెచ్చుకుంటున్నట్టుగా మాట్లాడి, తల్లితోనూ, తమ్ములతోనూ ఆ ఇంట ప్రవేశించాడు.

తరవాత ధర్మరాజు భీముడితో రహస్యంగా విదురుడు చెప్పినదంతా చెప్పి, "భీమసేనా, ఈ ఇంటి సువాసన చూడు. అంటిస్తే ఇది క్షణంలో అంటుకుంటుంది. మనని ఈ ఇంట దహనం చెయ్యటానికి ఏర్పాటయినవాడే ఈ పురోచనుడు. అందుచేత మనం జాగ్రత్తగా ఉండాలి," అన్నాడు.

ఆ మాట విని భీముడు, "అయితే, మనం ఈ ఇంట్లో ఉండనే వద్దు. మొదట ఉన్న బసకే పోదాం," అన్నాడు.

"అది పెద్ద పొరపాటు. మనం ఈ ఇంట్లో కాలిపోయే అవకాశం లేకపోతే ఈ పురోచనుడు మనని మరొక విధంగా చంపే ప్రయత్నం చేస్తాడు. మనం ఈ ఇంటితో పాటు కాలిపోయామనే భ్రమ కలిగించి తప్పించుకు పారిపోవటం ఒకటే ఉపాయం. పారిపోవటానికి గాను మనకు అరణ్యమార్గాలు బాగా తెలియటం అవసరం. వేట నెపంతో రోజూ అరణ్య మార్గాలన్నీ అన్వేషింతాం," అన్నాడు ధర్మరాజు.



ఆ ప్రకారమే పాండవులు పగలంతా వేటాడుతూ అరణ్యంలో తిరిగి, రాత్రి తెల్లవార్లూ జాగ్రత్తమీద ఉంటూ వచ్చారు.

ఈ లోపుగా హస్తినాపురంలో విదురుడు సొరంగాలు తవ్వటంలో నిపుణుడైనవాణ్ణి ఒకణ్ణి పిలిపించి, వాడికి చెప్పవలసినదంతా చెప్పి, వాడు తన మనిషి అని తెలియగలందులకు కొన్ని సంకేతాలు చెప్పి వారణావతంలో ఉన్న పాండవుల వద్దకు పంపాడు.

వాడు పాండవులను చేరుకుని, "దుష్ట చతుష్టయం నియోగించి పంపిన ఈ దుర్మా





గ్గుడు పురోచనుడు వచ్చే కృష్ణచతుర్దశి రాత్రి ఈ లక్క ఇంటికి నిప్పు పెట్ట బోతున్నాడు. ఆ రాత్రి మీరు తప్పించుకు పోవటానికి ఈ ఇంటి మధ్యనుంచి ఊరి బయటి వనంలోకి సొరంగం తవ్వమనీ, దాని ద్వారా బయటపడి మీరు ఎట్లైనా వెళ్ళి పోవలసిందనీ విదురుడు హెచ్చరించాడు. నేను సొరంగం తవ్వటానికే వచ్చాను," అన్నాడు.

ఆ మనిషి ఇంటి మధ్యనుంచి ఒక బిలం తవ్వి, దాని ద్వారాన్ని ఎంతో నేర్పుగా కప్పిపెట్టి పాండవులకు చూపాడు. పాండవులు తామున్న ఇంటిని గురించిగాని, దానిని తగల బెట్టటానికి నియోగించబడిన పురోచనుణ్ణి గురించిగాని తమకు ఏ మాత్రమూ అనుమానం లేనట్టే ప్రవర్తించి, పురోచనుడికి నమ్మకం కలిగించారు.

కృష్ణచతుర్దశి వచ్చింది. ఆ రోజు కుంతీదేవి పురంలోని బ్రాహ్మణులకూ, బ్రాహ్మణ స్త్రీలకూ అన్నసంతర్పణ చేసింది. పురోచనుడు ఒక ఆటవిక స్త్రీనీ, ఆమె పిల్లలనూ పాండవులకు సేవ చెయ్యటానికి నియోగించాడు. ఆ ఆటవిక కుటుంబం వాళ్ళు వన్యఫలాలు తెచ్చేవాళ్ళు, ప్రతి పనిలోనూ కుంతీదేవికి సాయపడేవాళ్ళు. ఆ రోజు ఉత్సవం గనక ఆ స్త్రీతోబాటు, ఆమె కొడుకులు అయిదుగురూ జాస్తిగా కల్లు తాగి, ఆ రాత్రికి ఆ ఇంటనే పడుకున్నారు.

అర్ధరాత్రివేళ భీముడు వెళ్ళి, పురోచనుడు పడుకునే గది వాకిలికి నిప్పు అంటించి, తల్లినీ, అన్నలనూ సొరంగం గుండా పంపేసి, ఇంటి నాలుగు మూలలా నిప్పు పెట్టి, తాను కూడా బిలం ప్రవేశించి, సొరంగం తవ్వినవాడికి తమ క్షేమం తెలిపాడు. అందరూ సొరంగ మార్గాన అరణ్యం చేరారు.

వారు అరణ్య మార్గాన పోయేటప్పుడు కుంతి నడవలేకపోయింది. ఆమెను భీముడు

తన భుజాలమీది కెత్తుకున్నాడు. అతను మిగిలినవాళ్ళను కూడా పట్టుకుని నడిపించ వలసి వచ్చింది. ఈ విధంగా వాళ్ళు కటిక చీకటిలో పడి అరణ్య మార్గాన వెళ్ళి గంగా నదిని చేరుకున్నారు.

అక్కడ వారిని గంగ దాటించటానికి ఒక పడవ సిద్ధంగా ఉన్నది. ఆ పడవను విదురుడే ఏర్పాటుచేశాడు. పడవవాడు చెప్పిన మాటలనుబట్టి వాడు విదురుడి మనిషేనని రూఢి అయాక పాండవులు తల్లితో సహా వాడి పడవ ఎక్కి గంగ దాటారు. పడవవాడు పాండవులు చెప్పిన సంకేతపు మాటలు గ్రహించి, వాటిని విదురుడికి చేర్చటానికి హస్తినాపురానికి పడవ నడుపుకుంటూ వెళ్ళిపోయాడు.

ఇంకా రాత్రి కొంత మిగిలి ఉన్నది. పాండవులు నక్షత్రాలనుబట్టి దిక్కులు తెలుసుకుని, దక్షిణంగా నడవ నారంభించారు. కొంతదూరం వెళ్ళాక భీముడు తప్ప మిగిలినవాళ్ళు ఒక్క అడుగైనా నడవలేకపోయారు. రాత్రంతా నిద్ర లేదు, దారీ తెన్నూలేని అరణ్య మార్గాన నడక! అందరూ చతికిలబడటం చూసి భీముడు అందరినీ ఒక్కసారే ఎత్తుకుని కొంతదూరం నడిచి, ఒక చోట దించి, కూర్చున్నాడు.




కొంచెం సేపయాక కుంతి భీముడితో, "నాయనా, దాహంతో ప్రాణం పోయేటట్టున్నది," అన్నది. భీముడు మళ్ళీ అందరినీ ఎత్తుకుని పోయి ఒక మర్రిచెట్టు కింద దించి, "మీరందరూ ఇక్కడే పడుకుని ఉండండి. నేను వెళ్లి మీ అందరికీ నీరు తెస్తాను," అని బయలుదేరాడు. కొంతదూరం పోగా అతనికి నీటిపక్షుల కలకలం వినిపించింది. ఆ దిక్కుగా పోగా ఒక కొలను కనిపించింది. భీము డందులో స్నానం చేసి, తల్లికీ మిగిలినవారికీ కావలిసిన నీరు తీసుకుని తిరిగి వచ్చేసరికి, అందరూ గాఢనిద్రలో ఉండటం కనిపించింది.



"ఇంత ఆపదలో కూడా వీళ్ళు ఇంత నిద్ర పోతున్నారంటే ఎంతగా అలసి పోయారోగదా!" అనుకుని భీముడు, వాళ్ళను లేపటానికి మనసొప్పక, వారు ఎప్పుడు లేస్తారా, నీరిద్దామని వేచి కూర్చున్నాడు.

అక్కడ వారణావతంలో పాండవులుండిన ఇల్లు కాలిన సంగతి ఊరు ఊరంతా తెలిసింది. జనం పోగయారు. ఇంకా మంటలు అంతో ఇంతో మండుతూనే ఉన్నాయి. సొరంగం తవ్వినవాడు ఆ మంటలను ఆర్పేవాడిలాగా బూడిదను అటూ ఇటూ తోస్తూ బిలద్వారాన్ని అతి నేర్పుగా కప్పేశాడు. పురోచనుడి శవమూ, ఆటవిక స్త్రీ శవమూ, ఆమె అయిదుగురు కొడుకుల శవాలూ కాలి గుర్తించ రాకుండా ఉన్నాయి. కుంతితో సహా పాండవులూ, వారివెంట ఉన్న పురోచనుడూ ఆ ఇంట కాలి పోయారని జనం అనుకున్నారు.

ఈ వార్త హస్తినాపురం చేరింది. కుంతీ పాండవులు ఇంటితో సహా కాలి పోయారని వినగానే ధృతరాష్ట్రుడు గుండె లవిసి మూర్ఛ పోయాడు. విదురుడు కూడా నలుగురితో బాటు తాను కూడా దొంగ కన్నీరు కార్చాడు.

అక్కడ పాండవులు అలిసి నిద్ర పోతున్న వనంలో హిడింబు డనే రాక్షసు డుండేవాడు. వాడిది నల్లగా, అతి బలిష్ఠంగా ఉండే దేహం, పసుపుపచ్చ కళ్ళు, భయంకరమైన ఆకారం, వేల్లాడే పెద్ద కడుపు, మొనతేలిన ఎర్రని మీసాలు. వాడు నర భక్షకుడు. ఆకలి దహించుకుపోతూ హిడింబుడు ఆహారం కోసం అరణ్యమంతా తిరుగుతూ, ఒక మద్దిచెట్టెక్కాడు. దాని మీద కూర్చుని వాడు జుట్టు విదిలించుకుంటూ, బుర్ర గోక్కుంటూ, పెద్ద పెట్టున ఆవలిస్తూ, చుట్టూ చూస్తుండగా వాడికి దూరాన మర్రిచెట్టు కింద పడుకుని కొందరు మనుషులు కనిపించారు.

హిడింబుడు తన చెల్లెలైన హిడింబను పిలిచి, "చెల్లీ, చాలా కాలానికి మనిషి మాంసం దొరికింది. నువు వెళ్లి, ఆ మర్రి చెట్టు కింద ఎంత మంది ఉంటే అంత మందినీ చంపి తీసుకురా. మనం కడుపు నిండా తిని నృత్యం చేద్దాం," అన్నాడు.

హిడింబ అలాగే నని బయలుదేరి, పాండవులున్న చోటికి వచ్చి, నిద్రపోతున్న కుంతినీ, ధర్మరాజునూ, అర్జున నకుల సహదేవులనూ, వారికి కాపలా కాస్తున్న భీముణ్ణీ చూసింది. హిడింబి కంటికి భీముడు ఎంతో నాజూకుగానూ, నవమన్మ ధుడుగానూ కనిపించాడు. ఆమెకు అతనిపై మోహం పుట్టుకొచ్చింది. ఆ మోహావేశంలో ఆమెకు అన్న చాలా దూరంగా ఉన్నట్టు తోచాడు. ఆ మనుషులను చంపేకన్న బతికి ఉండనిస్తే తాను ఆ నవమన్మధుడితో ఎంతోకాలం సుఖంగా ఉండవచ్చు నను కున్నది హిడింబ.

ఆమె అందమైన రూపం ధరించి చక్కని బట్టలు కట్టుకుని సిగ్గుతో కూడిన చిరు నవ్వులను భీముడి మీద ప్రసరింపజేస్తూ, దగ్గిరికి వచ్చి, "మహానుభావా, నువ్వెవరు? మీ దే దేశం? ఈ నిద్రపోయేవారెవరు? ఎంతో సుకుమారి లాగా ఉన్న ఈ ముసలావిడ ఎవరు? ఈ అరణ్యంలో నా అన్న హిడింబు డుంటాడనీ, అతను మహాబలుడైన రాక్షసు డనీ, అమిత క్రూరుడనీ తెలీదా? వీళ్ళు నిశ్చింతగా ఎలా నిద్రపోతున్నారు? మిమ్మ ల్నందరినీ చంపి ఆహారంగా తెమ్మని మా అన్న నన్ను పంపాడు. కాని నీ అందం చూస్తుంటే నాలో మోహం పుట్టుకొచ్చి, మిమ్మల్ని చంప బుద్ధి కావటంలేదు. నా కోరిక తీర్చావంటే, మీకు మా అన్న భయం లేకుండా మిమల్ని కామగమనం ద్వారా సురక్షిత ప్రాంతానికి చేర్చుతాను. అక్కడ మన మిద్దరమూ సుఖంగా ఉండగలం. నా మాట కాదనకు," అన్నది.





# గాంధీ కథ

## 10

ఇది ఇంతతో పోలేదు. ఫిబ్రవరి 10 ఉదయం గాంధీ, స్మట్స్‌తో చేసుకున్న ఒప్పందం ప్రకారం, తాను మొదటి భారతీయుడుగా రిజిస్ట్రేషన్ చేయించుకునేటందుకు తన ఇంటి నుంచి బయలుదేరాడు. ఆయన తన ఆఫీసులోకి పోతూ, వెలపల వీధిలో కొందరు పఠానులు తారట్లాడటం చూశాడు. వారిలో మీర్ అలం అనే ఆరడుగుల ఎత్తుగల భారీ మనిషి, గాంధీ క్లయింటు కూడా ఉన్నాడు. గాంధీ పలకరిస్తే మీర్ అలం ఏదో నసిగి, ఆయనను అనుసరించ సాగాడు. వాన్ బ్రాండన్ వీధిలోకి వచ్చాక అతను గాంధీని ఎక్కడికి పోతున్నావని అడిగాడు. గాంధీ సమాధానం చెప్పేలోపల పఠానులు ఆయనను కొట్టారు. "హేరాం," అంటూ గాంధీ స్పృహతప్పి పడిపోయాడు. వాళ్ళు ఆ రోజు గాంధీని చంపేసి ఉండే వారే, కాని కొందరు అనుచరులూ, దారేపోయే తెల్లవాళ్ళూ వచ్చి అడ్డుపడ్డారు.

విపరీతంగా రక్తం ఓడుతున్న గాంధీని సమీపంలో ఉన్న దుకాణంలోకి చేర్చారు. స్పృహరాగానే గాంధీ అడిగిన మొదటి ప్రశ్న, "మీర్ అలం ఎక్కడ?" అని. మిగిలినవాళ్ళతో బాటు అతను కూడా అరెస్టయినట్టు తెలిసి ఆయన, "అతన్ని విడిచి పెట్టాలి," అన్నాడు.

గాంధీని ఆయన మిత్రులు తమ ఇంటికి తీసుకుపోయి పదిరోజులపాటు సేవచేశారు. అన్ని రోజులూ గాంధీని చూడటానికి జనం తీర్థప్రజగా వచ్చారు. పూర్తిగా కోలుకున్నాక గాంధీ ఫీనిక్స్‌లో ఉన్న కస్తూర్బాయినీ, తన పిల్లలనూ చూడటానికి వెళ్ళాడు. రైలు చార్జీలకు డబ్బులేని కారణంగా వారే



స్మట్స్‌కు జరిగినదంతా జ్ఞాపకం చేస్తూ విపులంగా రాశాడు. జరిగినదంతా మరో విధంగా ఉండినట్టు స్మట్స్ తెలిపాడు.

గాంధీ రెండవ సత్యాగ్రహోద్యమ పథకం తయారు చేశాడు. ట్రాన్స్‌వాల్ భారతీయులు భోగిమంట వేసి తమ రిజిస్ట్రేషన్ కార్డులను అందులో అహుతి చేశారు. స్మట్స్‌కు ఇది చెప్పు దెబ్బ. జైలు నుంచి విడుదల అయివచ్చిన మీర్ అలం గాంధీకి షేక్‌హాండ్ ఇచ్చాడు.

భారతీయులు జైలు యాత్రకు సిద్ధపడ్డారు. కొద్దిమంది భారతీయ ప్రముఖులు నేటాలు సరిహద్దు దాటి ట్రాన్స్‌వాల్ ప్రవేశించి, రిజిస్ట్రేషను చట్టాన్ని ఉల్లంఘించిన నేరానికి అరెస్టయారు. లైసెన్సు లేకుండా వీధి వర్తకం చెయ్యటం జైలుకు పోవటానికి సులువైన మార్గం. లైసెన్సులు ఉండి కూడా అధికారులు అడిగితే చూపక కొందరు భారతీయులు అరెస్టయారు.

1908 అక్టోబరులో గాంధీ అరెస్టయాడు. ఆయనను పరమదుర్మార్గు లుండే ఖైదులో ఉంచారు. వారితోబాటు రాయిలాటి నేలను తవ్వించారు. గాంధీ చేతులు బొబ్బలెక్కాయి. అలిసి, మూర్ఛ వచ్చేటట్టున్న ఖైదీలకు ఆయన ప్రోత్సాహం ఇచ్చాడు.

యిన్ని రోజులుగా గాంధీ ఉన్నచోటికి రాలేక పోవటం జరిగింది.

ఈ విధంగా గాంధీ, స్మట్స్‌తో తాను చేసుకున్న ఒప్పందం కోసం, తన ప్రాణాలను ఒడ్డటం జరిగింది. అయినా స్మట్స్ తానిచ్చిన మాటను తృణప్రాయంగా ఎంచి, దాన్ని నిలబెట్టుకోక పోయాడు. ఇది చూసి గాంధీతోబాటు కార్ట్‌రైట్ కూడా విస్మయం చెందాడు. ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం "కుక్క పట్టీ" చట్టాన్ని ఉపసంహరించలేదు. "పచ్చిమోసం" అన్న శీర్షిక కింద "ఇండియన్ ఒపినియన్" పత్రికలో గాంధీ ఘాటుగా రాశాడు. ఆయన జనరల్



ట్రాన్స్‌వాల్ ప్రభుత్వం ఎంతమందిని జైలులో ఉంచగలదు? అది ఖర్చుతో కూడిన పని. అందుచేత భారతీయులను స్వదేశానికి పంపటానికి అది నిశ్చయించింది. ఇది అత్యంత క్రూరమైన పని. అసంఖ్యాకులైన దక్షిణాఫ్రికా భారతీయులకు భారతదేశంలో ఎవరూ లేరు. వాళ్ళు దక్షిణాఫ్రికాలో వేరుతన్నినవాళ్ళు.

ఈ అభాగ్యులకు గాంధీ తాను చేయగలిగినదేదో చేశాడు, సుప్రీం కోర్టులో దావా వేయించాడు. దేశ బహిష్కరణ చట్టవిరుద్ధమని సుప్రీం కోర్టు తీర్పు ఇచ్చింది. భారతీయ వర్తకుల మీద తెల్ల బాకీదార్లు ఒత్తిడి తెచ్చి వారిని దివాలా ఎత్తించేశారు. వారు చేసిన నేరం గాంధీ ఉద్యమంలో చేరటం! వీటి ఫలితంగా ఉద్యమం కొంత మందగించింది. కాని అది పూర్తిగా రద్దుకాక ఒక విధమైన ప్రతిష్ఠంభన ఏర్పడింది.

దక్షిణాఫ్రికా ఐక్యతకుగాను ఇంగ్లండులో చర్చలు 1909 లో ఆరంభమయాయి. ఆ సమయంలో గాంధీ అక్కడికి వెళ్ళి, చూడవలిసిన వారినందరినీ చూశాడు. కాని దక్షిణాఫ్రికా భారతీయుల పరిస్థితి మెరుగు కావటానికి ఆయన చేసిన ప్రయత్నం వ్యర్థమయింది. భారతీయుల హక్కుల పోరాటం ఇంతలో ముగిసేదిగా కనబడలేదు. దివాలా తీసిన భారతీయ వర్తకులు రాజకీయాల నుండి విరమించుకున్నారు. సత్యాగ్రహ అసోసియేషన్ వద్ద డబ్బు కూడా లేదు. కాని అదృష్టవశాత్తూ 1910 లో సర్ రతన్ తాతా 25,000 రూపాయలు పంపాడు. ఆ వెనకనే ఇండియన్ నేషనల్ కాంగ్రెసు నుంచీ, ముస్లిము లీగు నుంచీ, హైదరాబాదు నిజాము నుంచీ డబ్బు అందింది.

అయినా ఖర్చు తగ్గించే ఉద్దేశంతో గాంధీ సత్యాగ్రహులకు ఒక శిబిరం ఏర్పాటు చేశాడు. ఇది "టాల్‌స్టాయ్ ఫాం" అనే 1100 ఎకరాల క్షేత్రంలో ఉన్నది. అక్కడ

ఒక వెయ్యి ఫలవృక్షాలూ, ఒక ఇల్లూ ఉన్నాయి. 50 నుంచి 75 వరకూ సత్యాగ్రహులు—హిందువులూ, ముస్లిములూ, పార్సీలూ, క్రైస్తవులూ—అక్కడ ఉండి, జైలు జీవితం కన్న కఠినమైన జీవితం గడుపుతూ, పొదుపుగా జీవించేవారు. పిల్లల దగ్గిర నుంచీ అందరూ శ్రమించేవారు. ఈ క్షేత్రాన్ని కొన్నవాడు కల్లెన్‌బాఖ్ అనే జర్మనువాడు. అతను గాంధీవాది. అతనికి చెప్పులు కుట్టటం వచ్చును. ఆ విద్యను గాంధీ మొదలు అందరూ నేర్చారు.

సత్యాగ్రహం నాలుగేళ్ళు సాగింది. సత్యాగ్రహులు జైళ్ళకు పోతున్నారు. విడుదల అవుతున్నారు. 1911 జూనులో, అయిదవ జార్జి పట్టాభిషేకం సందర్భంగా, సత్యాగ్రహు లందరూ విడుదల అయి, ఒక విధమైన రాజీ అమలు జరిగింది. ఈ రాజీ 1912 ఆఖరుదాకా కొనసాగింది. 1912 లోనే గోఖలే ప్రభుత్వ అతిథిగా దక్షిణాఫ్రికాకు వచ్చి, పర్యటించాడు. ఆయన దక్షిణాఫ్రికా యూనియను మంత్రులతో మాట్లాడి, "ఒక్క సంవత్సరంలో అంతా సర్దుకుంటుంది. మీరు ఇండియాకు వచ్చెయ్యండి," అని గాంధీతో అన్నాడు.

"ఈ మంత్రు లెలాటివాళ్ళో మీ రెరగరు, నే నెరుగుదును," అన్నాడు గాంధీ.

గాంధీ అన్నమాటే నిజమయింది. గోఖలేతో అన్నట్టుగా ప్రభుత్వం భారతీయులపై విధించిన 3 పౌనుల పన్ను ఎత్తివేయలేదు. అంతే కాదు, క్రైస్తవ మతానుసారం జరగని పెళ్లిళ్ళేవీ చెల్లవని దక్షిణాఫ్రికా ప్రభుత్వం ఒక శాసనం చేసింది. ఈ దెబ్బతో హిందూ, ముస్లిము, పార్సీ మతరీత్యా జరిగిన వివాహాలు అక్రమమైనవి, వారి సంతానం అక్రమ సంతానం! ఈ దిక్కుమాలిన చట్టాన్ని అమలు జరపవద్దని గాంధీ ఆక్రోశించాడు. అది అరణ్యారోదనమయింది.



# 97. "రపనుయి" ప్రాచీన విగ్రహాలు

"రపనుయి" అనేది చిలీ (దక్షిణ అమెరికా) దేశానికి 2,000 మైళ్ళ దూరాన పెసిఫక్ మహా సముద్రంలో ఉన్నది. 1722 ఈస్టరు ఆదివారంనాడు మొట్టమొదటగా ఒక యూరోపియను—డచ్చి నౌకాధికారి—దానిపై అడుగుపెట్టటంచేత ఈ దీవికి "ఈస్టర్" దీవి అన్న పేరు వచ్చింది. ఈ దీవిలో 'పోలినీసియను'లనే ప్రాచీన జాతివారు అల్పసంఖ్యలో నివసిస్తున్నారు. వీరు తమ పూర్వీకుల విగ్రహాలను సమిష్టి శ్మశానాల దగ్గిర నిలబెట్టారు. ఒక్కొక్క విగ్రహం బరువు 50 టన్నుల దాకా ఉండవచ్చు. వీటిని చెక్కటానికి రాళ్ళను దీవియొక్క ఈశాన్యదిశ నుంచి తెచ్చారు. ఇంత బరువైన రాళ్ళను ఏ సహాయమూ లేకుండా ఎలా తెచ్చారన్నది వింతగా ఉండేది. అయితే ఇటీవల థార్ హెయెర్డాల్ అనే శాస్త్రవేత్త, కర్రలూ, మోకులూ మాత్రమే ఉపయోగించి ఇక్కడివాళ్ళు తమ పూర్వీకుల భారీ విగ్రహాలు నిలబెట్టటం చూశాడు.



Photo by K. S. Vijayaker



బహుమతి
పొందిన వ్యాఖ్య

తోడ వున్నది

పంపినవారు:
పి. సరోజిని, కురుపాం

Photo by K. S. Vijayaker



బహుమతి
పొందిన వ్యాఖ్య

నీడ మాత్రమే

పంపినవారు:
పి. సరోజిని, కురుపాం

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబర్ నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: తోడ వున్నది

రెండవ ఫోటో: నీడ మాత్రమే

పంపినవారు: శ్రీమతి పి. సరోజిని

కురుపాం. (శ్రీకాకుళం జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road. Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'






# బ్రూక్ బాండ్ A-1 డస్ట్
# ప్యాకెట్టుకు హెచ్చు కప్పుల మంచి టీ

BB 5379




మాధుర్య జీవితానికి క్యాడ్‌బరీస్!

Cadbury's

విశిష్టమైన మరియు మీగడ పాల చాక్‌లెట్ అంటే క్యాడ్‌బరీస్...
ఇది ఆనందాన్ని కలుగజేస్తుంది. ఆరు విధములయిన
రుచులతో కూడిన ఆనందాన్ని మీరు
క్యాడ్‌బరీస్‌తో పొందగలుగుతారు.

ప్రతి చాక్‌లెట్ పాలయొక్క



గుణములు గలిగినది!

LPE-AIYARS-C2TL

## 'నన్ను కాలేజీ క్రికెట్ జట్టుకు కేప్టెన్‌గా ఎంచుకొన్నారు!'



కాని, కొన్ని నెల్లంతు ముందు నాకు ఎల్లప్పుడూ నీరసంగా వుండేది. అందువలన నన్ను క్రికెట్ జట్టులో చేర్చుకోలేదు. ఒక డాక్టర్ని చూశాను.

డాక్టరు ఇలా అన్నారు: "నీకు చదువుకు, ఆటకు కావలసిన అదనపు శక్తి కోసం రోజూ హార్లిక్స్ త్రాగు."



హార్లిక్స్ అద్భుతంగా పనిచేసింది. నా ఓపిక, ఉత్సాహములను చూచి నన్ను క్రికెట్ జట్టుకు కేప్టెన్‌గా ఎంచుకొన్నారు!

### హార్లిక్స్ సహాయముతో ప్రగతి చెందాను!

చురుకుగా వుండే యువతీ యువకులకు వాళ్ళు వినియోగ పరిచే శక్తిని యిచ్చుటలో హార్లిక్స్ సహాయపడుతుంది. హార్లిక్స్ నీరసత్వాన్ని పోగొట్టి మిమ్మలిని మంచి ఆరోగ్యముతో వుంచుతుంది. చిన్న వారికీ పెద్ద వారికీ హార్లిక్స్ శ్రేష్ఠమైన ఆహారము. రోజూ హార్లిక్స్ త్రాగండి!




హార్లిక్స్ మీగడ గల పాలతో గోధుమ పిండి మరియు మాల్టెడ్ బార్లీల పోషకవంతమైన సారముల చేర్పు తయారు చేయబడినది

# హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!



మోర్టన్స్ స్వీట్లు భలే
మజాగా ఉంటాయి!










**MORTON**

వారి నాణ్యమైన కన్‌ఫెక్షనరీ, ముద్ద పాలు, వెన్న.

రుచి చూడండి: లాక్టోబాన్‌బాన్స్ ● క్రీమ్ టాఫీలు ● పైనాపిల్ క్రీమ్ ● లెమన్ బార్లీ కోకొనట్ ● కోకొనట్ క్రేకర్‌టీస్

ASP/M-9/69

# చక్కటి క్రిస్మస్ ఫొటోగ్రఫీ వారిచే మొదలుపెట్టించుటకు



# క్లిక్ III




మీ బాలుని పరిచయం చేయండి, ఛాయాచిత్ర కళా ప్రపంచంలోని సౌందర్యానికి, ఒక క్లిక్ III కెమేరాతో. అది ఉపయోగించుట చాలా తేలిక. గుణించుట లాంటి గడబిడలు ఏమీ లేవు. గురిచూచి మీటనొక్కితే చాలు. ప్రథమ ప్రయత్నంలోనే, అది చేకూర్చుతుంది, ప్రజ్వలమైన ఫలితాలు. ప్రతిఫిల్మ్ రోలుతో తీయవచ్చు, పన్నెండు ప్రకాశవంతమైన చిత్రాలు. ఈ పండుగ దినాలలో, మీ బాలున కివ్వండి, కానుకగా ఒక క్లిక్ III కెమేరా. ఆరంభించుటకు, అనుక్షణం వెంట అంటిపెట్టుకొని యుంచుకొనుటకు, అత్యుత్తమమైన కెమేరా అదే.

ఆథరైజ్డ్ అగ్ఫా డీలర్ల అందరివద్ద లభిస్తుంది.



అగ్ఫా పర్యవేక్షణ క్రింద,



ది న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్, బరోడా, వారిచే తయారు చేయబడినది.

సోల్ డిస్ట్రిబ్యూటర్స్:

ఆగ్ఫా గెవార్ట్ ఇండియా లిమిటెడ్, బొంబాయి · క్రొత్త ఢిల్లీ, కలకత్తా · మద్రాసు.

CMAG-119-TEL


డిసెంబర్ విడుదల!
భాస్కర్ పిక్చర్స్
బందిపోటు భీమన్న
నిర్మాత:
దోనేపూడి బ్రహ్మయ్య
దర్శకత్వం
ఎం. మల్లికార్జునరావు
ఆంధ్ర:
విజయ
సీడెడ్:
నవభారత్
నైజాం:
దివ్యదత్తా
STUDIO
Roopkala
VIJAYA

